తెలుగు కథల
సమాహారం

మార్చి, 2007

వెల: రు. 8/-

# కథాకేళి



తెలుగు పాఠకులకు ప్రతినెలా...

# కంప్యూటర్ విజ్ఞానం

## సంవత్సరానికి కేవలం రు. 300/- కే



విద్యార్థులకు, ఉద్యోగస్తులకు, కంప్యూటర్ ఉపయోగించే ప్రతి ఒక్కరికీ...
ప్రతి నెలా చక్కటి కంప్యూటర్ 'విజ్ఞానం'

**ఏప్రిల్, ఆగస్ట్, డిసెంబర్ నెలలలో**
**వందలాది యుటిలిటీలుగల ఉచిత సి.డి.లతో...**






సంవత్సర చందాలు ఈ క్రింది చిరునామాకు
ఎమ్.ఓ./డి.డి./ చెక్కు రూపంలో పంపించండి.

*(విజయవాడ / హైదరాబాద్ లోకల్ చెక్కులు లేదా At Par చెక్కులు మాత్రమే అనుమతించబడతాయి.*

## CRESCENT PUBLICATIONS

29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, VIJAYAWADA - 520 002
Ph: 0866 - 6662666 / 6663666 - Fax: 2432183



KRSA101M120

# Quick Heal

## AntiVirus Plus 2007

**AntiVirus + AntiSpyware + Firewall**

For Dealer Enquiry: 09397346512

భారతదేశపు అత్యున్నత ఏంటీవైరస్

**3 - in - 1 Pretection**

**AntiVirus**

Detects and removes viruses, warms and trojans automatically Protects your files, scans and cleans infection from email attachments and internet downloads automatically

**AntiSpyware**

Blocks spywares before they get installed on your PC Protects your privacy by detecting and cleaning spywares and blocking their activities of identity theft automatically

**Firewall**

Locks hackers and thieves out of your PC delivers total protection against known and unknown internal and external network based attacks

| | | | | |
|---|---|---|---|---|
| AntiVirus | Scans and Cleans incoming files through email attachments internet downloads and instant messengers Continuously protects the PC from viruses Internet worms and trojans | ✓ | ✓ | ✓ |
| AntiSpyware | Detects and cleans spywares adwares dialers and other riskwares and protects identity theft | ✓ | ✓ | ✓ |
| Personal Firewall | Locks hackers and thieves out of your PC You can control which applications can communicate over Internet and network | | ✓ | ✓ |
| Content Filter | Blocks access to unwanted websites on your PC based on the contents of the website | | | ✓ |
| AntiSpam | Blocks junk mails porn mails and other spam mail from entering your inbox | | | ✓ |
| Data Theft Protection | Prevents unauthorized copy of confidential/sensitive data from your PC Blocks access to pen drive/CD writer or other USB storage devices on your PC | | | ✓ |
| Hijack Restore | Restores back control of your PC by cleaning restoring settings hijacked by spyware or Internet malwares | | | ✓ |
| Privacy Tool Track Cleaner | Removes tracks of your PC usage by cleaning relative registry entries thereby protecting for privacy | | | ✓ |

**Cat Computer Services Pvt. Ltd.**
H.O Pune 020 25683631 / 32
e-mail marketing@quickheal.com

Branch Offices Mumbai 24118591 Delhi 25896645 Bangalore 51211549 Chennai 42322154 Kolkata 22309693 Baroda 6621369 Nagpur 2540750 Ahmedabad 65130996 Hyderabad 27845782 Nashik 2576306 Surat 9824508753 Indore 2436730 Chandigarh 9316090797

# రచనలకు రచయితలకు స్వాగతం

'కథాకేళి'లో ప్రచురణకు రచనలు పంపేవారు క్రింది విషయాలు గమనించవలసిందిగా మనవి.

★ సరదాగా చదువుకోవడానికి ఉపయోగపడుతూనే ఎంతో కొంత సమాజహితం కోరే కథలకు, హాస్యకథలకూ అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

★ అనువాద / అనుసరణ కథలు అనుమతించబడవు

★ కథ సైజుపై ఎలాంటి నియమాలూ లేనప్పటికీ చిన్న కథలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది.

★ రచనల ఒరిజినల్ వ్రాత ప్రతులు మాత్రమే పంపించాలి. జెరాక్స్ కాపీలు అనుమతించబడవు.

★ రచనలు అరతావు లేదా ఎ4 సైజు పేపరుపై ఒక్కవైపునే వ్రాసి, వీలైనంత వరకూ కొట్టివేతలు, దిద్దివేతలూ లేకుండా ఉండాలి.

★ నచ్చిన కథకు అవసరమైన మార్పులు చేసుకునే హక్కు మాకు ఉంటుంది

★ ప్రచురించిన ప్రతి కథకూ పారితోషికం ఇవ్వడమే గాక ఆ నెల నుంచి సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపిస్తాం.

**కార్టూన్సు, జోక్స్:**

★ కార్టూన్లు, జోక్స్ నిరభ్యంతరంగా పంపవచ్చు (కార్టూన్స్ 11x7 సైజుకి వచ్చేలా బ్లాక్ & వైట్‌లో ఉండాలి.)

**పుస్తక సమీక్షలు:**

★ పుస్తక సమీక్షల నిమిత్తం కొత్తగా విడుదలైన పుస్తకాలు మాత్రమే (రెండు కాపీలు) పంపాలి.

★ విడుదలైన నెలరోజుల లోపుగా పంపించాలి.

**సభలు / సమావేశాలు:**

★ సాహిత్య కార్యక్రమాల వార్తలు, ఫోటోలు కూడా పంపవచ్చు.

★ కార్యక్రమం జరిగిన తేదీ, స్థలం మొదలైన వివరాలతో కార్యక్రమం జరిగిన 15 రోజులలోపుగా పంపించాలి.

★ ఫోటో వెనుక సందర్భం, ఫోటోలోని వ్యక్తులపేర్లు వివరంగా వ్రాయాలి.

సంపుటి : 1
సంచిక : 11

మార్చి, 2007

ఎడిటర్: యం. నాగకుమారి




మాస పత్రిక

# పండగెప్పుడు?

తెలుగువారి జీవితాలలో 'పండుగ'లకు ఎంతో ప్రాధాన్యత ఉంది. కోటీశ్వరులైనా, నిరుపేదలైనా వారి వారి స్థాయిలలో వివిధ పండుగలను ఉత్సాహంగా జరుపుకొంటారు. పండగల కోసం కొన్ని వారాలు, నెలల ముందే ప్రణాళికలు తయారుచేసుకొంటారు – శలవులను ఎలా ఎడ్జస్ట్ చేసుకోవాలా అని ఆలోచిస్తుంటారు – ప్రయాణాలు పెట్టుకొంటారు. అతి సామాన్యుడు సైతం ఇంత జాగ్రత్తగా తన ప్రణాళికలను తయారుచేసుకుంటే – ప్రభుత్వాలు మాత్రం తమకి ఆ సమయానికి తోచినది ఉత్తర్వుల రూపంలో ప్రజలపై రుద్దేసి చేతులు దులుపుకొంటాయి.

ఈ సంవత్సరం 'ఉగాది' పండుగకు ఈ విధమైన తిప్పలు వచ్చాయి. దాదాపుగా కేలండర్లన్నీ ఉగాది 'మార్చి-20న' అని సూచిస్తూండగా ప్రభుత్వం దానిని '19గా' ప్రకటించి చేతులు దులుపుకొంది. పండగ 19నా లేక 20నా అనేది ఇక్కడ చర్చించడం లేదు. అసలు ఇటువంటి గందరగోళ పరిస్థితికి ఎందుకు అవకాశం ఇవ్వాలి? ప్రభుత్వం ముందే ఈ విషయమై ఎందుకు తగిన కసరత్తు చేయదు?

ప్రభుత్వం ప్రతి సంవత్సరం రెండు మూడు నెలలు ముందుగానే శలవుల జాబితా విడుదల చేస్తుంది. అలా విడుదల చేసేముందే ఈ తేదీలను కూలంకషంగా ఎందుకు పరిశీలించరు? దీనికి కారణం ఒక్కటే – చిత్తశుద్ధి లోపం.

గతంలో భద్రాచల రాముడి కళ్యాణం వంటి ముఖ్యమైన వాటికి కూడా ఈ తిప్పలు తప్పలేదు. ప్రస్తుత ఉగాది పరిస్థితి ఏమిటంటే ఇంట్లో ఇద్దరు పిల్లలుంటే ఒకరికి 19న, వేరొకరికి 20న పండగ. భార్యభర్తలిద్దరూ ఉద్యోగస్తులైతే ఒకరికి 19న, వేరొకరికి 20న శెలవు.

కనీసం భవిష్యత్‌లోనైనా ఇటువంటి పరిస్థితి పునరావృతం కాకుండా ప్రభుత్వం తగు చర్యలు తీసుకుంటుందని ఆశిద్దాం.

ముఖచిత్రం: ఉగాది - వయ్యారం! చిత్రకారుడు: ఉదయ్
కథలకు చిత్రాలు: పాణి, ఎ.వి.యం, కొచ్చెర్ల, మారుతి

Printed, Published and Owned by M. Rama Rao and Printed at Ratna Printing Works, 28-19-29, Janda Street, Arundel Pet, Vijayawada - 2. A.P. and Published at 29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, Vijayawada - 520 002. A.P. Editor: M. NAGAKUMARI







ఈనాటి ఆడపిల్లల ఆలోచనలకు అద్దంపట్టేలా ఉన్న 'సునంద' కథ చాలా బావుంది. 'కాటూరు' గారి సైనికుల వీరగాథలు ఉత్తేజకరంగా ఉంటున్నాయి.

– సి. రామచంద్రరావు, నెల్లూరు

'కథాకేళి' ముద్దుగా, ముచ్చటగా, మడవకుండా అరచేతిలో ఇమిడేలా అందమైన గెటప్‌తో మా మనసుల్ని రంజింపజేస్తోంది. 'సాయి అయితిక' గారి వ్యాసం ఒక గైడ్‌లా ఉపయోగపడుతోంది.

– వి.ఎస్. పారిజాత, హైదరాబాద్

'కథాకేళి' ఈ మధ్యనే చూసాను. కథలన్నీ చదివింపజేసాయి. 'ఇల్లాలి అదుపు' సరదాగా సాగింది. 'ఆకుపచ్చని జీవితం' కథపేరు అంతగా అతికినట్లు లేదు. 'శాపగ్రస్త' అంటే బాగుండేది. కథలతో మాత్రమే ఒక పత్రిక వస్తున్నందుకు ఎంతో సంతోషమైంది. కొద్దిగా పేజీలు పెంచితే పత్రిక నిండుచూలాలిలా ఉంటుంది.

– పినపోతు నరసింహం, కాకినాడ.

పత్రిక గమనంలో క్రమాభివృద్ధి కనబడుతోంది. సంతోషం. మూడు నెలలుగా పత్రిక నెల మూడవ వారంలో వస్తోంది. ఈ ఆలస్యాన్ని నివారించి పత్రిక మొదటివారంలోనే అందేలా చూడగలరు. కథలలో వైవిధ్యం అభినందనీయం. 'ఐతా చంద్రయ్య'గారి 'మంచిమనసు' చాలా బావుంది. 'కాటూరు' గారి కథనాలు క్లుప్తంగా, మనసు లోతులను స్పృశిస్తున్నాయి. 'నమ్మాల్సిందేనండోయ్' పత్రికకే విశిష్టగౌరవాన్నాపాదించే శీర్షిక. ఎన్నో తెరవెనుక చిక్కుకుపోయిన విషయాలను బహిర్గతం చేసి విశదీకరిస్తున్న 'సాయి అయితిక' గారికి అభినందనలు.

– డా॥ బద్దేపూడి రామచంద్రరావు, చీరాల

### పాఠకులకు మనవి

పాఠకులు తమ అభిప్రాయాలను నిస్సంకోచంగా తెలియజేయవలసిందిగా మనవి చేస్తున్నాం. మీకు నచ్చని విషయాలను గురించి కూడా తెలియజేస్తే తదనుగుణంగా మార్పులు చేయడానికి అవకాశం ఉంటుంది.

– ఎడిటర్

'మంచిమనసు' కథ చాలా బావుంది. వెంటనే ఆ ప్రదేశాలకు పయనమైపోవాలనే ఉత్సాహం కలిగింది. 'పగటి చంద్రుడు' కథలో పుట్టిన పల్లె నొదిలి ఎంతకాలమైనా పల్లెపై గుండెలోతుల్లోని మమకారం ఎప్పటికీ చెదిరిపోని వైనాన్ని రచయిత చక్కగా ఆవిష్కరించారు.

– కె. కవితారెడ్డి, హన్మకొండ

మహాశివుని ముఖచిత్రంతో వెలువడిన 'కథాకేళి' శివరాత్రి సింగారంతో మమ్మల్ని అలరించింది. ఏదైనా శివక్షేత్ర విశేషాలు అందించి ఉంటే మరింత నిండుదనం చేకూరేది. చిన్న చిన్న కథలతో ఇంటిల్లపాదీ చదువుకునే విధంగా వెలువడుతున్న కథాకేళికి మా అభినందనలు. 'పిచ్చితల్లి' కథలో మనుష్యుల్లోని మానవత్వాన్ని చక్కగా చూపించారు రచయిత. ఎడిటోరియల్స్ బావుంటున్నాయి.

– వి. రవీంద్రనాథ్, తిరుపతి

ఈ నెల ప్రచురించిన 'నిలువుదోపిడి' కథ చాలా బావుంది. వెంకట్రావు అతి జాగ్రత్త, అతి తెలివి వల్ల 'ఇంట్లోనే నిలువుదోపిడి' జరిగిన విధానం రచయిత పట్టుసడలకుండా కథని నడిపించిన తీరు బావుంది.

– కేదారి కృష్ణమూర్తి, నల్గొండ

'పాతబంగారం' పేరుని కోటేశ్వరరావుగారి కథ 'చిల్లపెంకులు' సార్థకం చేసుకుంది. "చిల్లపెంకులు పోయి, సీతామాలచ్చిమి దొరికింద"న్న రాజయ్య వ్యక్తిత్వం కృష్ణమ్మ దరహాసంలా అందంగా ఉంది.

– పోతిన విజయలక్ష్మి, కాకినాడ

ఎంతటివారినైనా లొంగదీసుకునే 'లంచం' విశ్వ రూపం 'అశ్వద్ధామ హతః కుంజరః' లో సాంబయ్య పాత్ర ద్వారా చూపించారు. ప్రస్తుతం మనమున్న సమాజంలో అవసరానికి లంచం తీసుకోవడం (ఇవ్వడం)లో తప్పులేదు అని మనల్ని మనమే మోసం చేసుకుంటూ బ్రతికేస్తున్నాం. నేనెప్పుడూ లంచం తీసుకోలేదు అనేవారైనా ఉంటారేమోగాని, నేనెప్పుడూ లంచం ఇవ్వలేదు అనేవారు ఉండరంటే అతిశయోక్తి కాదు. పాపం సాంబయ్య...!

– ఎల్. లక్ష్మీనరసింహ, హైదరాబాద్

పత్రిక బావుంది. కథలు బావుంటున్నాయి. అయితే కేవలం వంద పేజీలు... అదీ మాసపత్రికకు సరిపోవని నా భావన. పత్రిక కనీసం రెండు వందల పేజీలుండాలి. దానికి తగ్గట్లుగా ధర పెరిగినా పర్వాలేదు. త్వరలోనే 'కథాకేళి'ని ఆ విధంగా చూడగలమని మా ఆకాంక్ష.

ఎన్. మధుసూదన్, రాజమండ్రి

కొత్త రచయితలను ప్రోత్సహిస్తున్న తీరు బావుంది. అయితే ప్రతినెలా కొందరు ప్రముఖ రచయితల కథలు కూడా ప్రచురిస్తే బావుంటుంది. ఇది అటు పాఠకులకు, ఇటు వర్ధమాన రచయితలకూ ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

– బి. రాజు, భీమవరం

చక్కటి గెటప్‌తో, స్వచ్ఛమైన కథలతో వెలువడుతున్న 'కథాకేళి'కి అభినందనలు.

– ఎన్. కరుణ, నిజామాబాద్

ఈ సంచికలోని కథల వరుస

# ఎందుకీ ఆరాటం?

## ఎమ్మెల్సీ పదవుల కింత. ఆరాటం దేనికి?

ఎమ్మెల్సీ ఎన్నికల స్ఫూర్తికే విరుద్ధంగా శాసన మండలి ఎన్నికల బరిలోని అభ్యర్థులు కాసులు కుమ్మరిస్తున్నారు. కొందరు మిక్సీలు, టి.వి.లు, సెల్ ఫోన్లవంటి వాటిని ఎర వేస్తున్నారు. ఇంతా చేసి వీళ్లు గెలిచినా, తెలుగుదేశం అధికారానికి వస్తే శాసనమండలిని రద్దు చేస్తామని ముందే ప్రకటించింది. అలా చూస్తే, ఒకవేళ తెలుగుదేశం అధికారంలోకి వస్తుందని అనుకొంటే తుమ్మితే ఊడే ముక్కుకోసం వీళ్లకింత ఉబలాటం దేనికో అర్థం కాదు.

## ఎగువ సభ ఎలా ఏర్పడుతుంది?

రాజ్యాంగంలోని 168వ ఆర్టికల్ (అధికరణ) మేరకు ఎగువ సభ ఏర్పడుతుంది. ఇది కేవలం కొన్ని రాష్ట్రాలలోనే (జమ్ము-కాశ్మీర్, ఉత్తర ప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, కర్నాటక) ఉంది.

ఎగువ సభ మన రాష్ట్రంలోనూ ఉండేది. ఈ సభవల్ల ఖర్చు తప్పితే ఉపయోగంలేదని ఎన్టీఆర్ హయాంలో దీనిని రద్దు చేయటం జరిగింది. వృథా సంస్థలుగా భావించిన అన్నిటినీ రద్దు చేసి 'రద్దుల ప్రభుత్వంగా' ఎన్టీఆర్ గవర్నమెంటు గణుతికెక్కింది.

మన రాష్ట్రంలో 1957లో ఎగువ సభకు తీర్మానం చేయగా, 1958 – జూలై ఒకటో తేదీన విధాన పరిషత్ అవతరించింది. మండలి సభ్యులు 90 మంది ఉంటారు. అంటే దిగువ సభ సభ్యులలో మూడోవంతు ఉంటారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి 1995 జూన్ ఒకటిన రద్దయింది.

మళ్లీ కాంగ్రెస్ అధికారంలోకి రాగానే మండలి ఏర్పాటుకు ప్రయత్నాలు మొదలయ్యాయి. పదవీ వ్యామోహం రాజకీయల్లో ఒక ప్రాథమిక అంశం. దేశోద్ధరణ కన్నా స్వజనోద్ధరణే ప్రధాన ఎజెండా. రాజకీయ పునరావాసానికి, అసమ్మతి వర్గాన్ని బుజ్జగించటానికీ శాసన మండలిని అధికార పక్షం వినియోగించుకోనుందని, అందుకే దానిని పునరుద్ధరించనుందని వినిపించిన విమర్శలను కొట్టి పారేయలేం. ఇది శాశ్వత సభ (రాజ్యసభవలె). ఈ సభకు ఎన్నికయ్యేవారిలో మూడోవంతు మందిని విధాన సభే ఎన్నుకోవాల్సి ఉంటుంది. మరో మూడోవంతు స్థానిక సంస్థలు, 12 మంది సభ్యులను ఉపాధ్యాయులు, మరో 12 మంది సభ్యులను పట్టభద్రులూ ఎన్నుకుంటారు. 6 గురు సభ్యులను గవర్నర్ నామినేట్ చేస్తారు.

ప్రస్తుత పరిస్థితిని గమనిస్తే, కొత్త విధాన మండలిలో అధిక శాతం స్వంత పార్టీ మనుషులకే కాంగ్రెస్ స్థానం కల్పించడం ఖాయం. వచ్చే ఎన్నికల్లో ఒకవేళ కాంగ్రెస్ అధికారం కోల్పోయినా అప్పుడు ఎగువ సభలో ఎక్కువ మంది కాంగ్రెయులే ఉంటారు. ఇది వారికి పరోక్షబలం (తెలుగుదేశం అధికారంలోకి వచ్చి మళ్లీ 'రద్దు' చేయకుండా ఉంటే).

గతంలో ఎన్నడూ లేని విధంగా అధికార పక్షం అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటోంది. కొన్ని జి.వో.లు వివాదాస్పదంగా తయారయి, ఉపసంహరించబడటంతో ప్రతిపక్షాల విమర్శలకు బలం చేకూరింది.

## ఓటర్లలో అనాసక్తత

గ్రాడ్యుయేట్ ఓటర్లలో అధికశాతం ఈ ఎన్నికల పట్ల పెద్దగా ఆసక్తి కనబరచని కారణం

– శాశ్వతసభ భవితవ్యం గురించి ఉన్న అనుమానాలే. అభ్యర్థులలో కొందరు ఓటర్లకు డబ్బుతో పాటు సెల్‌ఫోన్లు వంటివి కూడా ఇచ్చారన్న వార్తలు – అవి పొందని వారిలో నిరాసక్తతకు కారణమౌతున్నాయేమోకూడా! ఇది ఒక విధంగా ప్రజాస్వామ్య విధానాన్ని అవహేళన చేయడమే.

## మండలి సభ్యులు ఏంచేయాలి?

ప్రత్యక్ష ఎన్నికల్లో పోటీ చేయడానికి మేధావి వర్గం ముందుకు రావడంలేదు. ఎన్నికలు, రాజకీయ పార్టీలపట్ల ఏర్పడిన విముఖత, నిరాసక్తతా వారిని ఎన్నికలకు దూరంగా ఉంచుతున్నాయి. ఇటువంటి పరిస్థితిలో మళ్లీ మన రాష్ట్రంలో ఏర్పడనున్న శాసనమండలికి ఎన్నికలు జరగనుండడంతో మేధావి వర్గాలలో కదలిక వచ్చింది.

అయితే ప్రస్తుత మండలి ఎన్నికలు సాధారణ ఎన్నికల బాటనే పట్టాయి. రాజకీయ సమీకరణాలు, వర్గ సమీకరణాలు, కుల సమీకరణాలు, విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెట్టడం – ఇవన్నీ చూస్తుంటే ఇవి విద్యావంతుల ఎన్నికలేనా? అనే సందేహం కలగకమానదు. ఎన్నికల కోసం విచ్చ

## హారితస

ల విడిగా డబ్బు ఖర్చుచేయడాన్ని ఏ మేధావీ హర్షించదు. మరి ఇప్పుడు ఈ ఎన్నికల్లో పోటీ చేసే మేధావులు(?) చేస్తున్నపని ఏమిటి?

మన రాష్ట్రంలో 1972–73 సంవత్సరంలో జై ఆంధ్ర ఉద్యమ సందర్భంగా రాష్ట్రపతి పాలన విధించినపుడు రాష్ట్రపాలనా వ్యవహారాలను 'శాసనమండలే' నిర్వహించింది. అంతేకాదు ఏదైనా ఒక చట్టం చేసేటపుడు శాసనమండలి కూడా కీలక పాత్ర వహిస్తుంది. దీనిని బట్టి శాసనమండలి పాత్రను అర్థం చేసుకోవచ్చు.

అయితే ప్రస్తుత పంథాలో ఎన్నికైన సభ్యులు రాజకీయాలకు అతీతంగా ఎంతవరకూ తమ బాధ్యతను నిర్వహించగలరు? డబ్బు వెదజల్లి పదవి దక్కించుకొన్నవారు నీతి, నిజాయితీలతో ప్రజాసేవ చేయడం సాధ్యమయ్యే పనేనా?

నేడు నిజాయితీగల నాయకుల కొరత తీవ్రంగా ఉంది. ఇప్పుడు కొత్తగా ఎన్నికయ్యే సభ్యులు 'ఎన్నికల తతంగం పూర్తయిన తరువాత అయినా తమ విద్యాసంపదని, తెలివితేటల్నీ ప్రజలకోసం కొంతయినా ఉపయోగించి నిజాయితీగా పని చేస్తారని ఆశిద్దాం. ●



**1**-1-2007 న హోటల్ 'హరిప్రియ'లో సాయంత్రం ఆరు గంటలకు 'ఆత్మీయులకు సత్కారం'. రాత్రి ఎనిమిది గంటలకు విందు. తప్పక విచ్చేయండి. గమనిక: చక్కని సాంస్కృతిక కార్యక్రమం కూడా ఉంటుంది.

ఈ ఆహ్వానపత్రికను తన బంధుమిత్రుల కు, పరిచయస్థులకూ పంచాడు గోపి. విభిన్నం గా ఉన్న ఆ ఆహ్వానాన్ని చూసి, అందరూ "ఎవరికీ సత్కారం...? ఎందుకు...?" అని అడిగారు. "అంతా సస్పెన్స్. అందరూ అక్కడికి వచ్చి తెలుసుకోవలసిందే" నంటూ వారందరికీ ఒకే



# వైచిత్ర్యం

సమాధానం ఇచ్చాడు గోపి.

"అమ్మా, నాన్నా... ఫస్ట్ తారీకున ఒక ఫంక్షన్ ఉంది..., ఆ రోజుకు మీరిద్దరూ కొత్త బట్టలు కొనుక్కోండి..." అంటూ డబ్బు ఇచ్చాడు గోపి. 'ఫంక్షనేమిటి...?, బట్టలు కొనుక్కోవడమేమిటి...?" అయోమయంగా అడిగారు ఇద్దరూ. "అదంతా తరువాత చెప్తాను. బట్టలు మాత్రం మంచివి తెచ్చుకోండి. ఎల్లుండే కదా ఫంక్షన్..." అన్నాడు. "ముందు నువ్వు చెప్పకపోతే తెచ్చుకోము" అన్నారు జంటగా. "తెచ్చుకుంటారు, నాకు తెలుసు. నా మాట మీరెప్పుడు కాదన్నారు కనుక...!" అంటూ టైమ్ అవుతున్నదని హడావుడిగా షాపుకి వెళ్ళిపోయాడు గోపి.

కొత్త సంవత్సరం... మొట్టమొదటి రోజు. సాయంకాలం. వాతావరణం చల్లచల్లగా, హాయిగా ఉంది. ప్రత్యేక దిన ప్రభావమేమో అందరి మనసులూ ఉల్లాసంగా, ఉత్తేజంగా ఉన్నాయి. కుదరని వాళ్ళు కూడా హోటల్ హరిప్రియకు వచ్చారు వీలు చేసుకుని, ఉత్కంఠ ఆపుకోలేక. ఫంక్షన్ హాల్ డెకరేషన్ అట్టహాసంగా ఉంది. ఎంట్రన్స్‌లో టేబుల్ దగ్గర నిలబడ్డ ఇద్దరు అందమైన అమ్మాయిలు వచ్చిన వారికి స్వాగతం చెప్తూ గులాబీలు అందిస్తున్నారు. హాల్లో అలంకరించిన పూలు సౌందర్యాతిశయంతో మిడిసిపడుతున్నాయి. అగరుబత్తీల కమ్మని పరిమళం, టేప్ రికార్డర్ మధుర సంగీతం వాతావరణాన్ని ఆహ్లాదభరితం చేస్తున్నాయి. హాల్లోకి వెళ్ళి కూర్చోగానే వెల్‌కమ్ డ్రింక్ సర్వ్ చేస్తున్నారు హోటల్ బాయ్స్. వచ్చినవారు గుసగుసలాడుకుంటున్నారు. సన్మానం ఎవరికి చేస్తున్నాడు...? ఎందుకు చేస్తున్నాడు...? మీకేమైనా తెలుసా" అని... ప్రముఖ సంఘసేవకులకా, కళాకారులకా, క్రీడాకారులకా..., ఎవరికి...? ఎవరు ఇతని ఆత్మీయులు...? ఇలా అందరూ తలోరకంగా ఊహలు సాగిస్తున్నారు. స్టేజి మీద రెండు మహారాజా కుర్చీలు వేసి ఉన్నాయి. రెండు భారీ పూలదండలు ఆ ప్రక్కనొకటి, ఈ ప్రక్కనొకటి కొక్కేలకు వ్రేలాడుతున్నాయి. 'తమని ఉపయోగించుకునేది ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తూ. అతిథులందరూ వచ్చాక, టేప్ రికార్డర్ ఆఫ్ చేసి, స్టేజ్ మీదకు వెళ్ళి, మైక్ చేతిలోకి తీసుకున్నాడు గోపి. చిరునవ్వుతో అందరినీ ఒక్కసారి కలియచూసాడు. "అందరికీ నమస్కారం. నా ఆహ్వానాన్ని మన్నించి వచ్చినందుకు కృతజ్ఞతలు. ముందుగా మీరు నన్ను క్షమించాలి. ఇంతవరకూ మిమ్మల్ని సస్పెన్స్‌లో పెట్టినందుకు. ఇప్పుడు మీ సందేహాలన్నిటికీ విపులంగా సమాధానం చెబుతాను. ఈ సన్మానం నన్ను కన్నవారికి. వారేం గొప్ప పని చేసారని ఈ సత్కారం అని మళ్ళీ మీకు ధర్మసందేహం కలుగవచ్చు. దానికీ జవాబు ఇస్తాను. కాకపోతే మీరు కొద్దిగా ఓపికతో వినాలి. బోర్ కొట్టించను లెండి..." అంటూ నవ్వాడు గోపి. "కానివ్... చెప్పు... చెప్పు..." అన్నారు ఇద్దరు ముగ్గురు చిన్నవాడనే చనువుతో.

కోపూరి పుష్పాదేవి

"నాకు నలుగురు ముఖ్య స్నేహితులు. వాళ్ళ కథలు చెబుతాను. అందరివీ మధ్య తరగతి కుటుంబాలే. ముందుగా కుమార్ గురించి.. అతనికి ఒక తమ్ముడు, ఒక చెల్లెలు. కుమార్ యావరేజ్ స్టూడెంట్. డిగ్రీ పూర్తి చేసి, ఏదో చిన్న ప్రైవేట్ జాబ్ చేస్తున్నాడు. వాడి తమ్ముడు చంద్రశేఖర్. చాలా తెలివైన విద్యార్థి. ఇంటర్ లో మంచిమార్కులు తెచ్చుకున్నాడు. అయినా అతనికి డాక్టరో, ఇంజినీరో కావాలన్న కోరి కలేం లేవు. కానీ, వాళ్ళ తల్లిదండ్రులకు ఆ ఆకాంక్ష బలీయంగా ఉంది. 'ఇంతవరకూ మన వంశంలో డాక్టరో, ఇంజినీరో అయినవారు లేరు. ఎంత కష్టపడి అయినా, ఎంత ఖర్చుపెట్టి అయినా నిన్ను చదివిస్తాం. నువ్వు మా ఆశలు తీర్చాలి' అన్నారు. సరేనని, అతను యమ్‌సెట్ వ్రాసి, మంచి ర్యాంకు తెచ్చుకుని, యమ్.బి.బి.యస్.లో చేరాడు. సహజంగా అతనికి ఆ కోర్సు మీద ఆపేక్ష లేనందున రెండవ సంవత్సరం చాలా పేపర్లు మిగిలిపోయాయి. ఆ కోర్సు చదవడం ఇక తన వల్ల కాదనుకున్నాడు. మరో కోర్సులోకి మారాలంటే, ఈ రెండుసంవత్సరాల సమయమూ, ఖర్చుపెట్టిన ఇంత డబ్బూ వృధా అవుతాయి. ఏంచేయాలో అతనికి పాలు పోలేదు. ఒత్తిడి తట్టుకోలేక, అమ్మా నాన్నలకు ముఖం చూపలేకా ఆత్మహత్యకు ఒడికట్టాడు. ఉన్న కొద్ది స్థిరాస్థులూ పోయాయి. తమ్ముడూ పోయాడు. అప్పులు మిగిలాయి. దిగులుతో కృంగిపోయిన తల్లిదండ్రుల, చెల్లెళ్ళ బాధ్యతలు ఇప్పుడు కుమార్ నెత్తిన పడ్డాయి.

* * *

ఇక రెండవ వాడు వినోద్. వాడికి ఒక్కతే చెల్లెలు... శాంతి. ఆమె ఇంటర్ ఫస్టియర్‌లో ఉండగా, చాలా మంచి కోటీశ్వరుల సంబంధం దొరికిందని, ఆలస్యం చేస్తే చెయ్యి దాటిపోతుందని, శాంతిని చదువు మాన్పించి, అప్పులు చేసి, ఆడంబరంగా పెళ్ళి చేసారు. అమ్మాయి అత్తవారింటికి వెళ్లి, ముచ్చటగా మూడునెలలు కాపురం చేసింది. ఒక ఘోరప్రమాదంలో శాంతి భర్త చనిపోయాడు. శాంతి కడుపులో బిడ్డతో, విధవరికంతో పుట్టింటికి చేరింది. ముక్కు పచ్చలారని పిల్ల, చేజేతులా ఆమె జీవితం నాశనం చేశామని, మనోవ్యాధితో కుంగి అమ్మా, నాన్నా మంచం పట్టారు. ఇక శాంతి పరిస్థితి చెప్పేదేముంది...? 'భర్త చనిపోతే, ఏ ఆడపిల్ల గతి అయినా, ఇంతే గదా' అని మీరు అడగవచ్చు... కానీ బాగా చదువుకుని, ఉద్యోగం చేస్తూ, తన కాళ్ళ మీద తాను నిలబడిన అమ్మాయి, తనకు వచ్చిన కష్టానికి కొన్నాళ్ళు దుఃఖపడినా చదువూ, ఉద్యోగం ఇచ్చిన ఆత్మ విశ్వాసంతో ధైర్యంతో, తుఫానులో కూలిన చెట్టు తిరిగి చిగురించినట్టు, ఛిద్రమైపోయిన తన జీవితాన్ని తాను పునర్నిర్మించుకోగలదు. కానీ..., ఇక్కడ శాంతికి వయసు లేదు, చదువు

## బద్ధకం

భవన నిర్మాణం జరుగుతోంది. కూలీలు ఇటుకలు మోస్తున్నారు. ఒక్కొక్క కూలీ ఎనిమిది ఇటుకలు చొప్పున తీసికెళ్తూండగా ఒక కూలీ మాత్రం నాలుగే తీసుకెళ్తున్నాడు. అది గమనించిన యజమాని ఆ కూలీని పిలిచాడు.

"అందరూ ఎనిమిదేసి ఇటుకలు మోస్తూంటే నువ్వు నాలుగే తీసికెళ్తున్నావేమిటి?" గద్దించాడు.

"ఆళ్లందరికీ బద్ధకం సార్! ఎక్కువసార్లు తిరగాల్సొస్తుందని ఎనిమిదేసి పట్టుకెళ్తున్నారు" అంటూ చకచకా తన దారిన వెళ్లిపోయాడు ఆ కూలీ.




లేదు, అనుభవమూ లేదు. గుండె చెదిరి, ఏ అర్ధరాత్రో ఆత్మహత్యకు సిద్ధపడుతుందేమోనని వినోద్‌కి మనశ్శాంతితో పాటు నిద్రకూడా కరువైంది.

మూడవ ఆమె కాత్యాయని. ఆమె తండ్రి సకల వ్యసన సంపన్నుడు. ఇల్లూ, ఒళ్ళూ గుల్ల చేసుకున్నాడు. ఆమె చూస్తూ చూస్తూ తల్లినీ, చెల్లెళ్ళనూ, తమ్ముళ్ళనూ గాలికి వదిలేయలేక తనపెళ్ళినే శాశ్వతంగా వదిలేసుకుంది. తండ్రి సంసారభారాన్ని నెత్తిన వేసుకుంది.

ఇక నాలుగవ వాడు ప్రవీణ్. వాడి తండ్రి లంచాలు పట్టడంలో ప్రవీణుడు. పట్టుబడి జైలు శిక్ష అనుభవిస్తున్నాడు. అలా వాడికీ సంసార భారం తప్పలేదు.

ఇలా నా స్నేహితులు నలుగురూ వాళ్ళ కుటుంబాల సాలిగూళ్ళలో చిక్కుకుని, బయటకు రాలేక, జీవితంలో సుఖమూ, శాంతీ లేక అల మటించిపోతున్నారు. నా తల్లిదండ్రులు మా త్రం తమకు పెంచే స్తోమతులేదని గ్రహించు కుని, నా ఒక్కడితోనే సరిపెట్టుకున్నారు. నా మీద ఆంక్షలేమీ పెట్టక, నన్ను స్వేచ్ఛా పావు రాన్ని చేసారు. వెర్రిఆశలు పెట్టుకోక, ఉన్న దానిలోనే సంతృప్తిగా బతకగలిగే ఆత్మవిశ్వా సాన్నిచ్చారు. నాకు దివ్యమైన జీవితాన్నిచ్చారు. పోరాడి గెలవడంలో తప్పులేదు. అది నిశ్చయం గా గొప్పవిషయమే. కాదనను. కానీ జీవితమం తా పోరాటమే అయితే ఇక జీవిత మాధుర్యం అనుభవించేదెప్పుడు...?

ఇప్పుడు చెప్పండి... నేను నా తల్లిదండ్రు లకు సన్మానం చేయడంలో ఏమైనా అనౌచిత్యం ఉందా...? నాకు తెలుసు... ఉన్నదని ఎవరూ చెప్పలేరు, చెప్పరు. కనుక ఆనందంగా కార్య క్రమం తిలకించి, హాయిగా విందు స్వీకరించం డి" అంటూ ఆహూతుల హర్షధ్వానాల మధ్య అమ్మా నాన్నలను ఆసనాల్లో ఆశీనులను చేసా డు గోపి. ●



ఉత్తరదేశ యాత్రలు ముగించుకొని ఆ రోజు ఉదయమే తన బాబాయి విశ్వనాథం జి.టి. ఎక్స్‌ప్రెస్‌లో ఊర్లోకి దిగుతున్నట్టు మెసేజ్ అందింది రఘురామ్‌కి. స్టేషన్‌కి వెళ్ళి బాబాయిని రిసీవ్ చేసుకున్నాడు. రెండ్రోజులు రఘురామ్‌తో గడిపి ఇంటికి వెళ్లాలన్నది విశ్వనాథం ప్లాన్.

"ఏమిటి బాబాయ్ మీ తీర్థయాత్రల విశేషాలు?" ఆటోలో ఇంటికి వస్తుండగా అడిగాడు రఘురామ్.

"టూర్‌కేమీ, బ్రహ్మాండంగా జరిగింది. కాశీలో గంగాస్నానం, మధుర, ఢిల్లీ, త్రివేణీ సంగమం... అన్నట్టొరే చెప్పడం మరిచాను... ఇటార్సీ స్టేషన్లో మనవాడు వీరభద్రం కలిసాడు" చెప్పాడు విశ్వనాథం.

"అరే! వీరభద్రం మావయ్య ఎలా ఉన్నాడేమిటి? ఎక్కడికెళ్తున్నాడు?" ఆత్రంగా అడిగాడు రఘురామ్.

"ఇంకెక్కడికి? అస్సాంలో వరదలట. సహాయ కార్యక్రమాల్లో పాల్గొనేందుకు ఉన్నపళంగా వెళ్తున్నాడట. మనిషి మాత్రం చెక్కుచెదరకుండా ఉన్నాడు" అన్నాడు విశ్వనాథం నవ్వుతూ.

రఘురామ్ భారంగా నిట్టూర్చాడు. అతని

# మమకారపాశం

పినతల్లి తమ్ముడు వీరభద్రం. పద్దెనిమిదేళ్ల వయస్సులోనే మిలట్రీలో సెలక్టయి, ఛండీఘర్ వెళ్లిపోయాడు. తరువాత "బంగ్లాదేశ్ యుద్ధంలో మెరుపులు మెరిపించాడని, చైనా బార్డర్‌లో ఉగ్రవాదుల పీచమణిచాడని, పాకిస్తాన్ టెర్రరిస్టుల భరతం పట్టాడనీ" అడపాదడపా వార్తలొస్తూనే ఉన్నాయి. "పెళ్లీ పెటాకులూ లేకుండా ఎన్నాళ్లు వీడిలా యుద్ధరంగాన్ని వదలకుండా తిరుగుతుంటాడని" పినతల్లి రఘురామ్ అమ్మ సావిత్రమ్మ దగ్గర తరచూ వాపోతుండేది.

పదిహేనేళ్ల సర్వీస్ తరువాత మిలట్రీ నుంచి బయటకు వచ్చాడు వీరభద్రం. అప్పుడైనా మాటవరసకైనా పెళ్లిమాట తలపెట్టకుండా బెంగుళూరు కంటోన్మెంట్ దగ్గర ఒక ఎస్టీడీ బూత్ పెట్టుకుని, ఏకాకిగా ఉండిపోయాడు. టెర్రిటోరియల్ ఆర్మీలో చేరి ఎక్కడ 'గొడవలు, ప్రకృతి వైపరీత్యాలు, ప్రమాదాలు' సంభవించినా హుటాహుటిన అక్కడకు వెళ్లిపోయి సహాయమందజేసేవాడు. ఒకవేళ ఆర్మీవారి నుంచి పిలుపు రాకపోయినా స్వంత ఖర్చులమీద ఆయా ప్రదేశాలకు వెళ్లి, అక్కడ ప్రశాంతత నెలకొనేవరకూ తన సేవలందించేవాడు. ఆ విధంగా 'లాటూర్ భూకంప బాధితులకు, గుజరాత్ అల్లర్లలోను, కార్గిల్ పునరావాసంలోను, ముంబై పేలుళ్ల సమయంలోను, బెంగాల్ వరదల్లో... ఆఖరుకు నిన్నమొన్నటి సునామీ వరకూ...' విష్ణుమూర్తిలా ఆయా ప్రాంతాల్లో ప్రత్యక్షమై సహాయ పునరావాస కార్యక్రమాల్లో పాల్గొనేవాడు వీరభద్రం. ఇలా పదేళ్లు గడిచిపోయాయి.

ఎప్పుడైనా ఇంటికి వచ్చినా పట్టుమని పది రోజులుండేవాడు కాదు. ఉన్నన్ని రోజులూ తన సాహసగాథలు, మిలట్రీ జోక్స్‌తో ఇంట్లో సందడి సృష్టించేవాడు. మావయ్యతో ఉంటే టైమ్ తెలిసేది కాదు రఘురామ్‌కి. పెళ్లి చేసుకుంటే తన సేవాకార్యక్రమాలకు సమయం చిక్కదనే నెపంతో నిరంతరం పెళ్లిని వాయిదా వేసేవాడు వీరభద్రం.

"వీడికి నవరసాల్లో వీర, భయానక అద్భుతరసాలు, హాస్యరసమూ బాగా వంటబట్టాయి గానీ శృంగారరసం ఛాయామాత్రంగా కూడా తగల్లేదు" అనేవారు విశ్వనాథం లాంటి పెద్దవాళ్లు.

వీరభద్రం పెళ్ళిని కళ్లారా చూడాలని ఆఖరు క్షణం వరకూ తపించి కన్నుమూసిందతని తల్లి. చాలాసార్లు ఆ ప్రస్తావన తెచ్చి, విఫలమై చివరికా ఊసే మానుకున్నారు బంధుమిత్రులు.

విశ్వనాథం, రఘురామ్ ఇంటికి చేరి, స్నానంచేసి బట్టలు మార్చుకొని, రఘురామ్ భార్య జానకి ఇచ్చిన ఫలహారం తింటుండగా వినిపించాయి కేకలు.

"ఏమనుకున్నావో చంపేస్తాను నిన్ను. ఎన్ని రోజులిలా ఓపికపట్టాలి? వెధవ సంత... వెధవ గోల..."

లౌడ్ స్పీకర్లో వినిపిస్తున్నట్టున్న ఆ గొంతు విని దడుచుకున్నాడు విశ్వనాథం. ప్రశ్నార్థకంగా రఘురామ్ వైపు చూసాడు.

"ఇది మాకు మామూలే బాబాయ్. మేడ మీద పోర్షన్లో అత్తాకోడళ్ల రభస. అడిగినంత కట్నం తేలేదని, కట్నం బాకీ వసూలు చేసుకురమ్మని అత్త కోడలు మీద తరచూ శివాలెత్తుతూ ఉంటుంది. పాపం ఆ కోడలు నోరులేని పిల్ల" అన్నాడు రఘురామ్.

విశ్వనాథం బాధతో నిట్టూర్చాడు. సాయం

రాచపూటి రమేష్

త్రం వరకూ విశ్రాంతి తీసుకుని "నేనలా వాకింగ్‌కి వెళ్లొస్తానోయ్" అని చెప్పుల్లో కాళ్లు దూర్చి బయల్దేరాడు.

"ఒక్క క్షణం ఆగు బాబాయ్" అని విశ్వనాథాన్ని ఆపాడు రఘురామ్. పట్టుచీర కట్టుకుని ఉన్న నలభై ఏళ్ల లావుపాటి ఆడమనిషి మెట్లు దిగుతోంది. ఆమెను పూర్తిగా వెళ్లనిచ్చి "నీవిక బయల్దేరవచ్చు" అన్నాడు రఘురామ్. "ఆవిడెవరు?" ఆసక్తిగా అడిగాడు విశ్వనాథం.

"అమ్మో! ఆవిడొక ఆడపులి. గొప్ప మహిళా నాయకురాలు. బహుశా పైనింట్లో అత్తగారికి క్లాసు పీకడానికి మేడమీద పోర్షన్‌కి వెళ్లిందేమో. ఆమె ఉండేది మన క్రింది అంతస్తులో. పేరు సక్కుబాయి". అన్నాడు రఘురామ్. విశ్వనాథం బయల్దేరి వెళ్లిపోయాడు. తనకు మొదటిసారి సక్కుబాయి పరిచయమైన వైనం గుర్తుకు తెచ్చుకున్నాడు రఘురామ్.

ఒకరోజు రఘురామ్ ఆఫీస్‌కి తయారై హడావిడిగా వెళ్తుండగా, తన పోర్షన్ ముందు నిలబడిఉన్న సక్కుబాయి "ఏయ్ మిస్టర్, కాస్త ఆగు" అంది.

రఘురామ్ ఆమె ఉగ్రరూపానికి, భీకరమైన కంఠధ్వనికీ ఠారెత్తిపోయి అలా నిలబడిపోయాడు.

"నిన్న సాయంత్రం టెర్రెస్ మీద బట్టలారేసేందుకు వెళ్తూ మీ ఇంట్లో కేకలు విని ఆగాను. ఆ సమయంలో నీ భార్యమీద నువ్వేం రంకెలు వేస్తున్నావో గుర్తుందా?" గుడ్లురుముతూ అంది సక్కుబాయి.

రఘురామ్ స్థాణువై గుర్తుందన్నట్లు తలూపాడు.

"కట్నం డబ్బులు అణాపైసలతో సహా వసూలు చేసుకురాకపోతే నిన్ను నిలువునా చీరేస్తాను అంటున్నావు. కిటికీలోంచి చూస్తే నీ భార్య క్రింద కూర్చుని గుడ్లనీరు కుక్కుకుంటోంది. ఇంట్లో మరెవరో కూడా ఉన్నట్టున్నారు. సిగ్గులేదా? కట్టుకున్న భార్యపై అలా ప్రవర్తించడానికి" నిలువెల్లా ఊగిపోతూ అరుస్తోంది సక్కుబాయి. ఆ సమయంలో ఆమె శరీరమంతా ఆవేశంతో కంపిస్తోంది.

"నేనెవర్నో తెలుసా? లెక్చరర్నన్న మాటే గానీ, పట్టణ మహిళా రక్షణ సమితి కార్యదర్శిని, విమెన్స్ ప్రొటెక్షన్ సెల్ మెంబర్ని. నా ఎదురుగానే ఇలాంటి అన్యాయం జరుగుతూంటే చేతులు ముడుచుకుని కూర్చుంటానా? తాట వలుస్తా, ఏమనుకుంటున్నావో" అంది ఉగ్రంగా.

రఘురామ్ చేతులు జోడించి "అమ్మా, ఆ సమయంలో నేనూ, మా కొలీగ్స్ మా ఆఫీస్ వార్షికోత్సవానికి మేము వేయబోయే నాటకం తాలూకు రిహార్సల్ చేస్తున్నట్టు, అలాగే అప్పుడే మా ఆవిడ క్రింద కూర్చుని ఉల్లిపాయలు తరుగుతున్నట్టు గమనించగోర్తాను" అని గబగబా కిందకు దిగాడు. ఆఫీసుకు చేరేంతవరకూ అతని గుండెదడ తగ్గలేదు.

ఆ తరువాత అతను పేపర్లలో, టీవీ న్యూస్‌లో. తరచూ సక్కుబాయి గారి పేరు చూస్తూనే ఉన్నాడు. వరకట్న బాధితురాళ్లకు అండగా, కట్నం చావులు, లైంగిక వేధింపుల సమయాల్లో బాధితురాళ్లకు అండగా నిలచి, తమ సమితి తరపున పోరాటం చేసే వీరవనితగా ఆమె పేరు వింటూనే ఉన్నాడు. ఆమె పురుషద్వేషి అని, మగాళ్ల పొడ ఆమెకు గిట్టదని, అందుకే నలభై ఏళ్లొచ్చినా ఇంకా బ్రహ్మచారిణిగానే ఉందనీ కాలనీలో కొందరు పురుషపుంగవులు చాటు

మాటుగా వాపోయేవారు. ఏది ఏమైనప్పటికీ ఆ కాలనీలోని మగాళ్లందరికీ ఛాలెంజింగ్‌గా, ఒక సింహస్వప్నంలా సక్కుబాయి నిలచిందన డంలో ఏ మాత్రం సందేహంలేదు. సక్కుబాయి ఇంట్లోకి అప్పుడప్పుడూ వెళ్లడానికి సాహసించే పురుషపుంగవుడు దూరంగా మరో కాలనీలో కాపురం చేస్తున్న ఆవిడ తమ్ముడు బుచ్చిబాబు మాత్రమే.

ఆఫీస్‌లో ఫైళ్లు తిరగేస్తూ ఉండగా, అటెం డర్ యాదయ్య రెండు ఉత్తరాలు తెచ్చి రఘు రామ్ టేబిల్‌పై ఉంచాడు.

ఒకటి ఎల్ఐసి ఆఫీస్ నుంచి రఘురామ్ కట్టవలసిన ప్రీమియం మొత్తాన్ని తెలుపుతున్న ఉత్తరం. మరొకటి రఘురామ్ మావయ్య వీర భద్రం నుంచి వచ్చింది. బెంగుళూరు చిరునా మాతో వచ్చిందది. చాలాకాలం తరువాత మావయ్య నుంచి ఉత్తరం రావడంతో ఆత్రంగా కవర్ చించి, ఉత్తరాన్ని చదివాడు రఘురామ్. పదిహేనవ తారీఖున వస్తున్నట్టు, వారం రోజు లు రఘురామ్‌తో ఉండి, తనకున్న ఉబ్బసానికి హోమియో ట్రీట్‌మెంట్ తీసుకోవాలనీ రాసాడు వీరభద్రం.

ఉక్కుమనిషిలా ఎవర్‌గ్రీన్‌గా ఉండే వీరభ ద్రానికున్న ఒకే ఒక ఆరోగ్య సమస్య ఆస్తమా. చలికాలం దాని ప్రభావం ఎక్కువవుతుంది. రఘురామ్ ఉండే కాలనీలోని హోమియో డాక్ట ర్‌పై ఆయనకు అపారమైన నమ్మకం. రెండేళ్ల క్రితం ఆయన ఇచ్చిన మందులు వాడడంతో ఉబ్బసం తగ్గుముఖం పట్టింది వీరభద్రానికి. అయితే ఈ ఏడాది జబ్బు మళ్లీ తీవ్రమవ డంతో, మళ్లీ అదే డాక్టర్‌ని కలిసి ట్రీట్‌మెంట్ తీసుకోవాలనుకుంటున్నాడట.

చాలాకాలం తరువాత మావయ్యను కలు సుకోబోతూండడంతో ఉత్సాహంగా ఉంది రఘురామ్‌కి. మావయ్య తెచ్చే మిలట్రీ మందు బాటిల్స్ కోసం, ఆయన చెప్పే సరదా కబుర్ల కోసం రఘురామ్ మనసు ఉవ్విళ్లూరసాగింది.

★ ★ ★

"ఏమిటి బాబూ ఇది? నువ్వు పేరుకు రఘు రాముడివైనా ఆ పేరు మీ అమ్మ నీకెందుకు పెట్టిందా? అని అనిపిస్తోంది. అన్నీ ఇలాంటి సినిమాలా తెచ్చేది? నన్ను గృహనిర్బంధంలో ఉంచి, బలవంతంగా ఇటువంటి చెత్త చిత్ర రాజములను చూపించి చిత్రహింసలకు గురి చేస్తున్నావు" నోట్లోంచి పైప్‌తీసి గుప్పున పొగ వదిలిన తరువాత అన్నాడు వీరభద్రం.

రఘురామ్ ఆయనవైపు కోపంగా చూసా డు. "మావయ్యా, నీకెన్నిసార్లు చెప్పాలి? నువ్వు ఈ చలికాలంలో అస్సలు బయటకు వెళ్లకూడ దు. అసలే ఇప్పుడు కోల్డ్‌వేవ్‌లో మన ప్రాంతం అల్లలాడుతోంది. ఇక ఈ సినిమాలకేం తక్కువ? ప్రస్తుతం నడుస్తున్న ట్రెండ్, క్రేజ్ ఈ సినిమా లదే" అన్నాడు నవ్వు పులుముకొని.

ప్రేమిస్తే, ప్రేమించుకుందాం రా, కహోనా ప్యార్‌హై, ప్రేమదేశం వంటి మార్కెట్‌లో విడు దలైన అన్ని తెలుగు, హిందీ ప్రేమ చిత్రాల సీడీలూ సోఫాపై చెల్లాచెదురుగా ఉన్నాయి. వారం రోజుల్నుంచీ ఇల్లు కదలకుండా వీరభ ద్రాన్ని గృహనిర్బంధంలో ఉంచి రోజుకు రెం డు, మూడు ప్రేమకథా చిత్రాల్ని చూపుతున్నా డు రఘురామ్. రెండురోజులకొకసారి సాయం త్రం డాక్టర్ దగ్గరకు, ఉదయాన్నే గంటసేపు వాకింగ్‌కి తప్ప మరెక్కడికీ బయటకు వెళ్లడం లేదు వీరభద్రం.

రఘురామ్ భార్య జానకికి తన మేరేజ్‌డే గిఫ్ట్‌గా భర్త ప్రామిస్ చేసిన నల్లపూసలు చేయిం

చలేదని కోపంగా ఉంది. కానీ తన దగ్గరున్న కాస్త డబ్బులూ ఇటీవల తండ్రికి జరిగిన ఆప రేషన్‌కి ఖర్చు పెట్టేయడంతో నిస్సహాయుడై నాడు రఘురామ్. వీరభద్రం కూడా ఇలా ఇం టిలో తిష్టవేయడం జానక్కి మింగుడుపడడం లేదు.

వీరభద్రానికీ ఈ నిర్బంధం చాలా బోరుగా ఉంది. కానీ డాక్టర్ ఆదేశాల మేర, వాతావరణ పరిస్థితులను బట్టీ ఆయన ఉబ్బసం తీవ్రమవు తుందని బయట తిరగడంలేదు.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి అమ్మా య్. నీకింత ప్రేమమూర్తి అయిన భర్త దొరి కాడు. నిన్నెంతగా ప్రేమిస్తున్నాడో" ట్రేలో రెం డు కాఫీ కప్పులు తెచ్చిన జానకితో అన్నాడు వీరభద్రం.

జానకి వీరభద్రానికీ, రఘురామ్‌కీ కాఫీ కప్పులందజేసి తిరిగివెళ్తూ రఘురామ్‌కి కన బడేలా మూతి మూడు వంకరలు తిప్పి వంటిం ట్లోకి వెళ్లిపోయింది. రఘురామ్ తనలో తాను నవ్వుకున్నాడు.

"ఈ పుస్తకాలు చదవాలంటే చాలా బోరు గా ఉందిరా. ఏవైనా డిటెక్టివ్ నవలలు, సాహస


## STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF KATHAKELI

*Form IV (See Rule 8)*

1. Place of Publication : Vijayawada
2. Periodicity of its Publication : Monthly
3. Printer's Name : M. Rama Rao
   Whether Citizen of India? : Yes
   Address : 29-25-43A, Vemuri Vari Street
   Surya Rao Pet, Vijayawada - 2
4. Publisher's Name : M. Rama Rao
   Whether Citizen of India? : Yes
   Address : 29-25-43A, Vemuri Vari Street
   Surya Rao Pet, Vijayawada - 2
5. Editor's Name : M. Naga Kumari
   Whether Citizen of India? : Yes
   Address : 29-25-43A, Vemuri Vari Street
   Surya Rao Pet, Vijayawada - 2
6. Name and Address of individuals who own the News paper and partners or share holders holding more than one percent of the total capital : M. Rama Rao
   29-25-43A, Vemuri Vari Street
   Surya Rao Pet, Vijayawada - 2

I, M. Rama Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd) **M. RAMA RAO**
Signature of the Publisher

Date: 1st March, 2007

గాథలు దొరికితే తేరాదా?" టీపాయ్‌పై ఉన్న పుస్తకాలను చూపుతూ అన్నాడు వీరభద్రం. చలం ప్రేమలేఖలు, యద్దనపూడి సెక్రటరీ, రాధాకృష్ణ వంటి ప్రేమ ఇతివృత్తంగా ఉన్న నవలలను చూపుతూ అన్నాడు వీరభద్రం.

రఘురామ్ గీతోపదేశం చేసే శ్రీకృష్ణుడిలా ముఖం పెట్టాడు. "మావయ్యా! ప్రేమ అనేది విశ్వజనీనమైన ఒక అద్భుతమైన ఫీలింగ్. దాని ని అనుభూతి చెందనివాడి జీవితం వృధాయే. ప్రేమకు వయసుతోగాని, అందంతోగానీ నిమిత్తంలేదు. ప్రేమ, పెళ్లితోనే జీవితానికి సార్థకత లభిస్తుంది. జబ్ ప్యార్ కిసీసే హోతాహై..."

"ఆపు, నీ సుత్తాపు. నేను స్నానంచేసి వస్తాను" అని టవల్ తీసుకుని బాత్‌రూమ్ వైపు నడిచాడు వీరభద్రం. రఘురామ్ నవ్వుకుంటూ ఆఫీస్‌కి వెళ్లడానికి తయారవసాగాడు.

★ ★ ★

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో వినిపించాయి భీతిగొలిపే కేకలు, ఆర్తనాదాలు... టీవీలో న్యూస్ చూస్తున్న జానకి, రఘురామ్, వీరభద్రం ఉలిక్కిపడ్డాడు.

"ఏమిట్రా ఆ కేకలు. ఈ వేళప్పుడు ఎక్కడ నుంచి" ఆందోళనగా అడిగాడు వీరభద్రం.

"కొంపమునిగింది, పై పోర్షన్‌లో ఏదో జరిగినట్టుంది" అని గబగబా షర్ట్ వేసుకుని మేడమీదకు పరుగెత్తాడు రఘురామ్. టీషర్ట్, పైజామాతో ఉన్న వీరభద్రం అతణ్ణిఅనుసరించాడు.

ఆ సరికే ఆ పోర్షన్ ముందు నలుగురైదుగురు గుమిగూడి ఉన్నారు. తలుపులు బిడాయించి ఉండడంతో లోపల ఏం జరుగుతోందో తెలియడంలేదు. తలుపులు ఎంత బాదినా తీయడంలేదు. సక్కుబాయి ఆవేశంతో చిందులు తొక్కుతూ ఉంది. ఎవ్వరికీ ఏం చేయాలో పాలుపోవడంలేదు.

ప్రశ్నార్థకంగా తన వంక చూసిన వీరభద్రానికి క్షణకాలంలో పరిస్థితిని వివరించాడు రఘురామ్. వీరభద్రం మరేమాత్రం ఆలస్యం చేయలేదు.

కదనరంగంలో కాకలుతీరిన వీరుడిలా అబలా రక్షణ కార్యక్రమానికి ఉద్యుక్తుడయ్యాడు. క్షణకాలంలో మేడమెట్లెక్కి టెర్రెస్‌పైకి చేరుకున్నాడు. ఏదో బిల్డింగ్ వర్క్ జరుగుతూ ఉండడంతో పనిముట్లు చెల్లాచెదురుగా పడిఉన్నాయక్కడ. వాటిలోంచి ఒక సుత్తి తీసుకుని, పళ్లతో అదిమిపట్టి వాటర్‌పైప్ సహాయంతో కిందికి దిగాడు.

వంటింట్లో వెంటిలేటర్ తాలూకు గాజుముక్కలు పగలడంతో ఇంట్లోనివారు ఉలిక్కిపడ్డారు. వీరభద్రాన్ని అడ్డుకోవాలన్న వారి ప్రయత్నం ఏ మాత్రం ఫలించలేదు. రెండే రెండు దెబ్బలతో ఇంట్లోని పురుషులిద్దరినీ మట్టికరిపించాడు. ఆడవారు ఆయన జోలికి పోవడానికి సాహసించినట్టులేదు.

అందుబాటులో ఉన్న దుప్పటిని మంటల్లో చిక్కుకుని ఉన్న ఆ ఇంటి కోడలు లావణ్యపై కప్పి మంటలనార్పి, వీధి తలుపు బోల్టు తీసి బయటకు తీసుకు వచ్చాడు.

చుట్టూ మూగిఉన్న అందర్నీ దూరంగా జరగమని, ఆటో తీసుకురమ్మని రఘురామ్‌ని పురమాయించాడు. ఆసరికే ఇంట్లోకి ప్రవేశించిన సక్కుబాయి కేకలు తారాస్థాయిలో వినిపిస్తున్నాయి.

పది నిమిషాల్లో దగ్గర్లోని ప్రైవేట్ హాస్ప

టల్‌లో ఉన్నారు వారు. మెడికో లీగల్ కేస్ కాబట్టి అడ్మిట్ చేసుకోమన్న వారికి పైజామా జేబులో ఉన్న తన డిఫెన్స్ ఐడెంటిటీ కార్డ్ చూపించి, బెదిరించి మరీ లావణ్యని బర్న్ వార్డ్‌లో అడ్మిట్ చేయించాడు వీరభద్రం.

నయానో భయానో అడ్మిట్ చేసుకున్నారు గానీ, వెంటనే పదివేలు అడ్వాన్స్ కట్టాలన్నారు హాస్పటల్ వారు. చుట్టూ ఉన్న అపార్ట్‌మెంట్ వాసులు చోద్యంగా చూస్తున్నారు గానీ ఎవ్వరూ కదల్లేదు. అప్పటికక్కడికి చేరుకున్న సక్కుబాయి రొప్పుతూ నిలబడింది. ఏం జరుగుతోందో అర్ధంకాలేదావిడకు.

మెరుపులా కదిలాడు వీరభద్రం. ఆటోలో ఇంటికి వెళ్లి, తన ఏటియం కార్డ్ తీసుకు॰ దారి లోని ఏటియం కౌంటర్‌లో డబ్బు డ్రా చేసి అరగంటలో రిసెప్షన్‌లో పదివేలు చెల్లించాడు. ఆ సరికే ముప్పైశాతం బర్న్స్‌తో ఉన్న లావణ్య కు చికిత్స ప్రారంభమైంది.

సక్కుబాయి వీరభద్రం వంక అబ్బురంగా చూసింది. మగవాళ్లలో ఇంత డేషింగ్ పర్సన్స్, ఇంత ఉదారస్వభావులూ ఉంటారా? అనుకుం ది. 'మగవాళ్ల గురించి తానిన్నాళ్లూ ఊహిం చుకుంది వేరు'.

గండం గడిచి బయటపడింది లావణ్య. సక్కుబాయి లావణ్య అత్తగారి ఇంటి ముందు ధర్నాలు జరిపించి, పోలీసులు, లావణ్య తల్లి దండ్రుల సహాయంతో బెదిరించి, భార్యాభర్తల మధ్య సయోధ్య కుదిర్చి, వారితో వేరుకాపురం పెట్టించింది. ఎలాగైతేనేం లావణ్య కాపురం చక్కబడింది.

వారంరోజులపాటు ట్రీట్‌మెంట్ తీసుకుని వెళ్తానన్న వీరభద్రం నెల్లాళ్లు దాటినా కదిలే సూచనలు లేకపోయేసరికి ఆశ్చర్యంతోపాటు చిరాకు కూడా కలగసాగింది జానకికి. రఘు రామ్ మాత్రం నోరు మెదపట్లేదు ఈ విషయం లో.

హోమియో చికిత్స మంచి ఫలితాన్నిచ్చి నట్టుంది. వీరభద్రానికి ఆస్తమా తగ్గుముఖం పట్టింది. చలి తీవ్రత తగ్గడంతో ఇంటిపట్టున ఉండకుండా షికార్లు చేసి వస్తున్నాడతను రోజూ పొద్దునా, సాయంత్రమూ.

ఒకరోజు సాయంత్రం కొలీగ్‌తో సినిమాకు వెళ్లిన రఘురామ్ అక్కడ వీరభద్రాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. 'యూత్‌ఫుల్ లవ్‌స్టోరీ' అది. పైగా వీరభద్రం పక్క సీట్లో పెప్సీ తాగుతూ సక్కుబాయి కూడా ఉంది.

ఆ రోజు రాత్రి సిటవుట్‌లో కూర్చుని పున్న మి చంద్రుణ్ణి చూస్తూ రఘురామ్‌ని అడిగాడు వీరభద్రం "సక్కుబాయి చాలా మంచావిడ కదరా!"

ఆ ప్రశ్న కోసమే కాచుకుని ఉన్నట్లు ఠకీ మని జవాబిచ్చాడు రఘురామ్ "ఔను మావ య్యా! నీలాగే పరోపకార ధోరణి ఎక్కువ. నీకు సరిగ్గా సూటవుతుంది". వీరభద్రం ముసిముసి గా నవ్వాడు.

మరో పదిహేను రోజుల్లో వీరభద్రం, సక్కు బాయిల వివాహం ఒక స్టార్‌హోటల్లో సింపు ల్‌గా జరిగిపోయింది. ఇద్దరి తరఫునా సుమారు వందమంది బంధుమిత్రులు పెళ్లికి హాజర య్యారు. ప్రపంచపు ఎనిమిదో వింతను చూస్తు న్నట్టు చాలామంది ఆశ్చర్యపోయారు.

తన చిరకాల కోరికైన నల్లపూసల చెయిన్ సమకూరినందుకు జానకి ఆనందాశ్చర్యాలకు అంతులేదు. 'అంత డబ్బు రఘురామ్ తనకు




తెలియకుండా ఎలా కూడబెట్టగలిగాడా' అని ఇంకా ఆశ్చర్యపోతోందావిడ.

'ఎలాగైనా వీరభద్రాన్ని పెళ్లికి ఒప్పిస్తానని విశ్వనాథం బాబాయితోను, సక్కుబాయిని పెళ్లి కి ఒప్పించడంతోపాటు మంచి సంబంధం కు దురుస్తానని బుచ్చిబాబుతోనూ' పందేలు కాసి, చెరి పదివేలు గెలుచుకున్న మాట జానక్కి చెప్ప నేలేదు రఘురామ్. అలాగే తన దృక్పథాన్ని మార్చివేయడంతో బాటు మంచి జోడీని కుదిర్చి నందుకు వీరభద్రం కూడా బలవంతంగా రఘు రామ్‌కి మరో పదివేలు కానుకగా సమర్పించు కున్నాడు. ప్రేమలు – పెళ్లిళ్లు ఇతివృత్తంగా గల సీడీలు, నవలలు వీరభద్రం చూసేలా చేసిన రఘురామ్ బుచ్చిబాబు ద్వారా అవి సక్కుబా యికీ సరఫరా చేసాడు. హోమియో మందు ల్లాగే అవి ఆ ఇరువురి దృక్పథాలూ మారేం దుకు చక్కగా దోహదపడ్డాయి.

పండుగరోజు ఉదయం వీరభద్రం ఇంటికి వచ్చిన రఘురామ్‌కి జీడిపాకం కప్పులో వేసి చెంచాతో బాటు అందించింది సక్కుబాయి. వీర భద్రం సూట్‌కేస్‌తో ప్రయాణానికి సిద్ధంగా వుండడంతో అడిగాడు రఘురామ్ "ఏం మావ య్యా! హనీమూన్‌కా ప్రయాణం? అయినా ఈ పాకం బాగా ముదిరినట్లుంది. మింగుడు పడ్డంలేదు."

వీరభద్రం పెద్దగా నవ్వి అన్నాడు. "మా మధ్య ఈ ప్రేమ కూడా లేటు వయసులో ఘా టైన ముదురుపాకం లాంటిది. దానికి ఏ హనీమూనూ అక్కర్లేదు. ఇక ఒరిస్సాలో తుఫా ను తాకిడికి తీర ప్రాంత ప్రజలు అల్లాడుతు న్నారట. ఇందాకే ఫోన్ రావడంతో బయల్దేరు తున్నాను".

సక్కుబాయి చిరునవ్వు నవ్వింది.

ఇంకా షాక్ నుంచి తేరుకోలేదు రఘు రామ్.

"ఏమండోయ్... నాకు 'బంగారు వర్షం' ప్రోగ్రామ్‌లో పది గ్రాముల బంగారం బహుమతి వచ్చింది." అంది విశాలి ఆఫీసు పనిలో అలిసిపోయి రాత్రి తొమ్మిదిన్నరకు వచ్చిన భర్తతో. ఆమె ముఖం మెర్క్యురీ బల్బ్‌లా వెలిగిపోతోంది.




"వెరీగుడ్, గొడవొదిలింది. సెల్‌లో యస్.యమ్.యస్‌లు చేయడానికి ఇప్పటికి కొన్ని వేలు ఖర్చయి వుంటుంది" అన్నాడు దీర్ఘంగా నిట్టూరుస్తూ.

"అది సరేగానీ వాళ్ళు మనల్ని పది గ్రాముల బంగారం తీసుకోడానికి ఫోన్ చేసి పిలుస్తారంట. అప్పుడు మనం బంగారం తీసుకొంటూంటే వీడియో తీసి టీవీలో చూపిస్తారట. మీరు కూడా ఆ టైమ్‌లో వుండాలిస్మీ అంది విశాలి.

"అంతా బాగానే వుంది గానీ, జాగ్రత్తగా వుండు. ఎవడైనా వచ్చి తలుపు తట్టి మేము పది గ్రాముల బంగారం ఇవ్వడానికి వచ్చేమంటే, ఎగురుకుంటూ వెళ్ళి వెంటనే తలుపు తీసేవు కొంపమునుగుతుంది." అన్నాడు భర్త.

"ఛ. మీరు ఇలాగే అన్నీ అపశకునం మాటలు మాట్లాడతారు" అంది విశాలి.

మర్నాడు విశాలి భర్త ఆఫీసుకు వెళ్ళినవెంటనే, రెండు పూటలకూ వంట చేసి పారేసి, "బంగారు వర్షం" ఫోన్ కోసం ఎదురుతెన్నులు చూడసాగింది.

# బంగారు వర్షం

ఈలోగా వీధిలో నిలబడి దాదాపు గ్రామ పంచాయితీలో టముకు వేసినట్టుగా ఆ వీధి అంతా అమ్మలక్కలకు తెలియజేసింది తన బహుమతి గురించి.

మరో తొమ్మిదిసార్లు గెలిస్తే మొత్తం వంద గ్రాములకు చిన్న సైజు వడ్డాణం చేయించుకోవచ్చు. నడుము లావై పోకుండా డైటింగ్ చేయాలి అని ఆలోచిస్తూ, వంద గ్రాముల బంగారం గెలుచుకున్నందుకుగాను, తనను మహిళామండలి వాళ్ళు సన్మానిస్తున్నట్టుగా పంచరంగుల కలలోకి వెళ్ళిపోయింది విశాలి.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు.

పరుగుతో వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా ఒక వ్యక్తి చేతిలో టీవీ పేరుతో మౌత్‌పీస్, రెండో వ్యక్తి చేతిలో వీడియో కెమెరా, ఇంకొక అమ్మాయి భలే స్టయిల్‌గా వుంది.

ఆమె విశాలిని ఉద్దేశించి –

"మేడమ్. విశాలిగారు మీరేనా?"

"అవునండీ..." అంది విశాలి. ఆమె ముఖం సన్ ఫ్లవర్‌లా వెలిగిపోతోంది.

"రాత్రి బంగారు వర్షం ప్రోగ్రాంలో మీరు పదిగ్రాముల బంగారం గెలిచారు గదా. మీకు బంగారం ఇవ్వడానికి వచ్చేం."అంది ఆ అమ్మాయి వళ్ళంతా తిప్పేసుకుంటూ, చిలక పలుకులతో–

"సాయంత్రం మావారు కూడా వస్తారు. అప్పుడు తీసుకుంటాను. మేమిద్దరం టీవీలో కనపడాలి." అంటూన్న ఆమెను ఇంట్లోకి తోసుకుంటూ ముగ్గురూ ఇంట్లోకి ప్రవేశించారు.

"ఏమిటిది?" అందోన్న ఆమెను సోఫాలో కూలద్రోసి, చేతులు వెనక్కి కట్టేసి, బీరువా తాళాలు ఇవ్వకపోతే నాలుగు తగిలించి, బీరువా తాళాలు తెరిచి మొత్తం దోచుకుని, ఆమె నోటికి ప్లాస్టర్ అంటించి, తలుపులు జాగ్రత్తగా మూసి వెళ్ళిపోయారు.

సాయంకాలం భర్త వచ్చేడు. పరిస్థితి చూసి, "బంగారు వర్షం కురిసిందన్నమాట. నేను అనుకుంటూనే వున్నాను... మళ్ళా ఎక్కడ యస్.యమ్.యస్. లు ఇస్తావోనని భయంతో సెల్ తీసుకువెళ్ళడం పొరబాటైపోయింది" అంటూ ఆమె కట్లు విప్పి. నోటిమీద టేప్‌తీసి, లోపలకువెళ్ళి తెరిచిదన్న బీరువా చూసి ధామ్మని పడిపోయాడు.

"ఏమండీ" అంటూ విశాలి భర్త దగ్గరకు ఆందోళనతో వెళ్ళింది. రాత్రి టీవీలో మేము ఫోన్ చేసే వరకూ కంగారు పడకండి. ఎవరైనా వచ్చి బంగారం ఇస్తామన్నా మోసపోకండి" అని మరీ మరీ చెప్పిన మాటలు సూచాయగా గుర్తుకు వస్తున్నాయిప్పుడు పాపం విశాలికి. ●

కె.బి. కృష్ణ

యమధర్మరాజు దగ్గర చిత్రగుప్తుని పేరుతో ఒక సహాయకుడు ఉంటాడనీ, ఆయన జీవుల ఆయుర్దాయం లెక్కలుకట్టి, ఎవరి చావు ఎప్పుడో నిర్ణయిస్తే, యమధర్మరాజు ఆ లెక్కల ప్రకారం ప్రాణాలు హరిస్తాడనీ మన పెద్దలు చెబుతారు. చిత్రగుప్తుడు యమధర్మరాజుకు ప్రతినిధిగా ప్రజలచే పూజింపబడుతూ ఉంటాడు.

ఉన్నట్టుండి భూలోకంలో ఒకరోజున - తెల్లవారేసరికి ఒక విచిత్రమైన వార్త ప్రచారంలోకి వచ్చింది. నేటికి సరిగ్గా అయిదవ రోజున చిత్రగుప్తులవారు కొలువు చేస్తారు. ఆ కొలువులో ప్రాణులకు ఒక మహత్తరమైన అవకాశం ఉంటుంది. జీవితంలో ఇప్పటివరకూ ఎవరెవరికి ఏఏవస్తువులు ఇష్టంలేవో, వేటిని తాము మిక్కిలి అసహ్యించుకుంటారో ఆయా వస్తువులన్నింటినీ ఒక కాగితంపై వ్రాసి దర్బారులో సమర్పిస్తే, వాటికి బదులుగా ఆయా వ్యక్తులు తమతమ మనసుల్లో కోరుకునే



డా॥ వాడవల్లి చక్రపాణిరావు

అందమైన వస్తువులు ఇవ్వబడతాయి. ఇలాంటి మార్పిడి జరగాలంటే, కోరుకునే వ్యక్తులకు సృష్టికర్త బ్రహ్మదేవుని సమర్థతపై సంపూర్ణ విశ్వాసం ఉండాలి. ఆయనపై నమ్మకం ఉంచి, ప్రజలు ఆయా గ్రామాలలోని దేవాలయాల దగ్గర ఒక దున్నపోతుని పూజించి, చిత్రగుప్తులవారి ప్రతిరూపాన్ని తయారుచేసి, దానికి భక్తిపూర్వకంగా నమస్కరించి, తమతమ అభీష్టవస్తువుల జాబితాను సమర్పించాలి. ఈ సమర్పణకు సుముహూర్తం సరిగ్గా నేటికి అయిదవరోజున సంభవించబోయే సూర్యగ్రహణ సమయం. గ్రహణానికి ముందుగాని, తరువాతగానీ వచ్చే అభ్యర్థనలు పరిగణించబడవు. అభ్యర్థన పత్రాలు అన్నిటినీ సర్వాంతర్యామి అయిన బ్రహ్మదేవుడే స్వయంగా పరిశీలించి, ఆయావ్యక్తుల అర్హతలను బట్టి వారివారి కోరికలను మన్నిస్తాడు. ఈ మార్పిడి అవకాశం భూలోకవాసులకే కాదు – సమస్త లోకాలవారికీ వర్తిస్తుంది. నమ్మకం గలవారు తమతమ అదృష్టాలను పరీక్షించుకోవచ్చు.

ఈ సమాచారం ఎక్కడనుంచి వచ్చిందో తెలియదు..ఎవరిద్వారా వచ్చిందో తెలియదు. దానిలోని నిజానిజాలు ఏమిటో కూడా ఎవరికీ తెలియవు. వినాయకుడు పాలు త్రాగుతున్నాడు అనేవార్త ఒకప్పుడు ప్రపంచమంతా క్షణాల మీద ఎలా వ్యాపించిందో, అంతకంటే వేగంగా ఈ సమాచారం సూర్యుడితో పాటుగా ఆ రోజున లోకాలను మేల్కొలిపింది.

భూలోకంలోని ప్రజలందరూ వింతగా చెప్పుకుంటూ, ఆ సంగతేమిటో తెలుసుకోవాలి అనుకున్నారు.

బ్రహ్మ సృష్టికర్త. సృష్టి ఉంది కనుక దీనికి కర్త ఒకడు ఉంటాడు అనుకోవడంలో తప్పేమీ లేదు. ఆయనపేరు బ్రహ్మ అనుకోవడానికీ అభ్యంతరంలేదు. ఇంతటి వైవిధ్యంతో సృష్టిని నిర్వహిస్తున్న ఆ బ్రహ్మ సర్వసమర్థుడు అనుకోవడానికీ అభ్యంతరం లేదు.

ఇక యమధర్మరాజు, ఆయన దగ్గరుండే చిత్రగుప్తుడూ – వీరిని గురించి మనపురాణాల్లో వింటాం. నాటకాలు, సినిమాల్లో వీరిచుట్టూ ఎన్నెన్నో కథలు కల్పించి చూపిస్తుంటారు. జీవి పుట్టటం ఎంతసహజమో, గిట్టటం కూడా అంతే సహజం. పుట్టుకకు కర్త బ్రహ్మ అయినట్లే, చావుకి కర్త యమధర్మరాజు అనుకోవడంలో దోషమేమీలేదు. చావులు ఎవరికిబడితే వారికి, ఎప్పుడు బడితే అప్పుడు రాకుండా ఒకపద్ధతి ప్రకారం వస్తున్నాయనేది యధార్థం. ఎవరికి ఎప్పుడు ఆయువు తీరితే వారు అప్పుడు పోతున్నారు తప్ప, తమతమ ఇష్టానుసారం ఎవరూ పోవటంలేదు. కాబట్టి ఈ విషయంలో ఏదో

# బ్రహ్మనాదం

ఒక పరిగణన ఉన్నట్టే కనిపిస్తుంది. కనబడని ఆ పరిగణన విభాగాన్నే మనపూర్వులు చిత్రగుప్తునిగా చెప్పి ఉంటారు. కాబట్టి ఆయన పేరుతో ఒక దర్బారు ఏర్పాటు చేసుకుని, మనసులలోని అసంతృప్తులను బ్రహ్మ సాక్షిగా వెల్లడించుకోవటంలో తప్పేమీ లేదు. ఇందులో ఎవరూ నష్టపోయేది ఏమీ ఉండదు. కాబట్టి ఈ మార్పిడి అవకాశం సంగతేంటో చూద్దాం అని ప్రజలు ఎవరికివారు నిశ్చయానికి వచ్చారు.

ప్రజల మనోభావాలు వింతవింతలుగా సాగాయి.

ఒక భర్త – 'మా ఆవిడ చాలా అసహ్యంగా ఉంది. ఈమెను మార్చి అందమైన భార్యను దేవుడు నాకిస్తే బాగుండును' అనుకున్నాడు.

ఒక భార్య – 'నా మొగుడు నరరూపరాక్షసుడు. వీడికి బదులు అందమైన మంచి భర్త రావాలి' అనుకుంది.

ఒక పడుచుపిల్ల – 'నా రూపం నాకే అసహ్యంగా ఉంది. ఈ రూపం పోయి అందమైన రూపం వస్తే బాగుండును' అని కోరుకుంది.

ఒక ముసలమ్మ వంగిపోయి, ముడతలు పడి, శక్తిహీనమైన శరీరాన్ని చూసుకుంటూ – 'జీవితంలో నేను ఏమీ అనుభవించలేకపోయాను. నా వయసూ, రూపమూ, శక్తీ నా ప్రమేయం లేకుండానే తరిగిపోయాయి. అసహ్యకరమైన ఈ రూపం పోయి, అందమైన పడుచుదనంతో కూడిన రూపం మరొక్కసారి వస్తే ఎంత బాగుంటుంది' అనుకుంది.



జగన్నాథ సాహితీ సమాఖ్య (నల్లజర్ల) చతుర్థ వార్షికోత్సవ సందర్భంగా జరిగిన సభలో కవితా జగన్నాథ్ కవితా సంకలనాన్నీ, 'మన రచయితలు – రచయిత్రులూ' రెండవ భాగాన్నీ ఆవిష్కరిస్తున్న దృశ్యం. ఫొటోలో వరుసగా (ఎడమనుంచి కుడికి) శ్రీయుతులు కె.ఎస్.ఎస్.వి.ఎస్.ఆర్. సోమనాథ్, వి.ఎస్.వి. ప్రసాద్, గుడిమెట్ల చెన్నయ్య, తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి, అగస్త్యరాజు సర్వేశ్వరరావు, కె.ఎస్.ఆర్.కె.వి.వి. ప్రసాద్, కొత్తపల్లి ఉదయబాబు.




రోగాలతో బాధపడుతూ మంచానికి అంటుకుపోయి నేడో, రేపో అన్నట్టుగా ఉన్న ఒక వ్యక్తి తన మనస్సులో – 'ఓ బ్రహ్మదేవుడా! నాకు ఈ బ్రతుకుపట్ల రోత పుట్టింది. నేను లేచి చిత్రగుప్తుని కొలువుకు రాలేను. గ్రహణం మొదలవగానే ఇక్కడినుంచే నీకు నమస్కరించుకుంటాను. ఈ శరీరాన్ని మార్చేసి నాకు ఆరోగ్యవంతమైన, అందమైన శరీరాన్ని ప్రసాదించు' అనుకున్నాడు.

ఇలా ఎందరెందరో ప్రజలు ఏవేవో కోరికలతో సిద్ధమయ్యారు.

ప్రతి గ్రామంలోనూ చిత్రగుప్తుని కొలువు ఏర్పాటయింది.

గ్రహణంరోజు రానేవచ్చింది. ప్రజలందరూ స్నానాలు చేసి, మడిబట్టలు కట్టుకుని, మొహాన బొట్టు పెట్టుకుని, పూజాద్రవ్యాలతో కొలువు కూటములకు వచ్చారు. యధాశక్తీ పూజలు చేసారు. గ్రహణం పట్టు మొదలయ్యేసరికి భక్తిగా కళ్లు మూసుకుని బ్రహ్మను ధ్యానించటం మొదలుపెట్టారు.

బ్రహ్మదేవుడు ఒక మొహంతో స్వర్గాన్నీ, ఇంకో మొహంతో భూలోకాన్నీ, మరొక మొహంతో పాతాళాన్నీ పరికించి చూశాడు. త్రిలోకాలలోనూ ఒక్కరు కూడా మినహాయింపు లేకుండా కొలువుకు వచ్చి కోరికలు చెప్పుకుంటున్నారు. బ్రహ్మకు ఆశ్చర్యంతో బుర్రలు తిరిగిపోయాయి. 'నా సృష్టిని గురించి ఇంతమందిలోనూ ఇంతటి అసంతృప్తా?' బ్రహ్మ చాలా బాధపడ్డాడు. 'నా సృష్టిలో ఏ ఒక్కడూ సుఖంగా, తృప్తిగా లేడా? మరోసారి చూద్దాం' అనిపించి, ఈసారి నాలుగవ ముఖంతో లోకాలన్నీ గాలించి చూసాడు. స్వర్గంలోనూ, పాతాళంలోనూ తనకు కావలసిన వ్యక్తి తగలలేదు.

కానీ, భూలోకంలో భారతదేశంలోని ఒక మారుమూలపల్లెలో ఒకే ఒక వ్యక్తి తన గోశాలలో గోవులను సేవిస్తూ కనిపించాడు.

బ్రహ్మకు ప్రాణం లేచివచ్చింది. హంసవాహనాన్ని అధిరోహించి, ఆఘమేఘాలమీద ప్రయాణించి, రెప్పపాటు సమయానికి ఆ వ్యక్తి ముందు ప్రత్యక్షమయ్యాడు.

"ఏమి నాయనా! నీవొక్కడివీ ఇక్కడ ఇలా గోవులతో ఉండిపోయావేం? నీవెరుగవా? ఇది పవిత్రమైన గ్రహణసమయం. ముల్లోకాల్లోని ప్రజలు తమతమ మనస్సులలోని అసంతృప్తులను బ్రహ్మకు నివేదించి, మార్పు కోరుకుంటున్నారు. మీ ఊరి జనమంతా కూడా చిత్రగుప్తుని కొలువుకు తరలి వెళ్లారు గదా! మరి నువ్వెందుకు వెళ్ళలేదు?" అని అడిగాడు.

ఆ వ్యక్తి తలెత్తి బ్రహ్మకేసి చూసి నమస్కరించాడు.

"దేవాధిదేవా! నాకు ఈ సృష్టి అంతా సర్వాంగసుందరంగాను, సర్వసమగ్రమైనదిగానూ కనిపిస్తూ ఉంటుంది. పరమదయామయుడవైన నీ సృష్టిలో లోపాలు ఎందుకు ఉంటాయి? అందుకే నాకు తెలిసినా నేను అందరితోపాటు ఆ కొలువుకేసి వెళ్ళలేదు." అన్నాడు.

బ్రహ్మ ఆశ్చర్యపోయి, "ఈ విశాలమైన విశ్వంలో నీకు అసంతృప్తి కలిగించే అంశం ఒక్కటి కూడా లేదా?" అని అడిగాడు.

"లేదు బ్రహ్మదేవా. అసంతృప్తి అనేది మనసుకి సంబంధించింది గదా! సృష్టికి సంబంధించింది ఎలా అవుతుంది? నువ్వు ఇంతమంది కోర్కెలు నెరవేర్చటం కోసం వారువారు కోరిన ప్రకారం ఈ సృష్టిని మార్పు చేసావనుకో. అప్పుడు మాత్రం వీరి మనస్సులలో కొత్త అసంతృప్తులు రావా? అయినా నాకు ఈ విశ్వసృష్టిలో ఏ లోపమూ కనిపించదు. ఈసృష్టిలోని ఏ చిన్న వస్తువును తీసుకున్నా నాకు అందులో సౌందర్యమూ, సమగ్రతా కనిపిస్తాయి. ఈ వస్తువులన్నీ నీ ప్రతిరూపాలే అనిపిస్తాయి. ఆఖరికి ఈ గడ్డి పరక ఉందనుకో. ఇందులో కూడా నాకు నువ్వే కనిపిస్తావు. ఈ గడ్డిపరకలను తిని ఈ ఆవు కడుపు నింపుకుంటున్నప్పుడు నీవు ఎంతటి దయామయుడవో కదా. అంతటి మహానుభావుడివై ఉండీ ఈ చిన్న గడ్డిపరకల రూపంలో పశువులను సేవిస్తున్నావే అని నీ వైభవమే గుర్తుకువచ్చి ఆనందంతో పరవశిస్తాను..."

బ్రహ్మదేవుడికి ఆ మాటలకు ఇంకా ఆశ్చర్యం కలిగింది. 'అణువణువునా బ్రహ్మమును దర్శిస్తూ ఆనందించే వ్యక్తికి ఈ సృష్టిలో ఎవరు సాటి?' అనుకున్నాడు.

"...మరయితే రోగాలు, రొష్టులు, ముసలితనం, మరణం... ఇవేవీ నీకు లోపాలుగా కనిపించటంలేదా?" అని అడిగాడు.

ఆ వ్యక్తి గట్టిగా నవ్వి, "ఓ చతుర్ముఖా! నన్ను మీరు పరీక్షిస్తున్నట్టుగా ఉంది. నేనేమంత చదువుకున్నవాడిని కాదు. పామరుణ్ణి. కానీ ఒక్కటి చెప్పగలను. పుట్టుక, ఎదుగుదల, ముసలితనం, మరణం అనేవి నీ సృష్టిలో భాగమైన సహజ పరిణామ దశలు. నేను ఒక మొక్కను పాతాను అనుకో. అది పెరిగి వృద్ధిఅయి, ఫలాలనిస్తుంది. ఆ ఫలాలలోని గింజల ద్వారా అలాంటివే కొత్త మొక్కలు ఎన్నో వస్తాయి. ఈ చెట్టు ముసలిదవుతుంది. ఎండిపోతుంది. అయితేనేం, ఆ వృక్షసంతతి వృద్ధి అవుతూనే ఉందిగదా! ఆ చెట్టు అలా ఎండిపోకపోతే దానికి దగ్గరలో కొత్త మొక్కలు రావు గదా! సృష్టిలోని వివిధ జీవులు ఈ విధమయిన వికాసాన్ని పొందటమే బ్రహ్మము అనేపదానికి అర్థమని నాకనిపిస్తుంది. ఇంక నువ్వు చెప్పిన రోగాలు, రొష్టులు, జరాభారం అన్నవి సృష్టిలో ఒక్క మానవునికి మాత్రమే







సమస్యలుగా మరాయి అనిపిస్తుంది. తక్కిన జీవరాశులు తమతమ దేహాలను సక్రమంగా వినియోగించుకుంటూ, ప్రకృతి సహజమైన జీవనవిధానాలను గడుపుతున్నాయి. కనుక వాటికి ఇలాంటి సమస్యలు లేవు. మానవుడు మాత్రమే తెలివితేటలతో ప్రకృతి విరుద్ధంగా జీవించి, రోగాలు, ముసలితనం మొదలయిన వాటితో బాధపడుతున్నాడు. మా తాత నూట పాతిక సంవత్సరాలు ఆరోగ్యంగా జీవించి, తిరుగుతూ, తిరుగుతూ కన్నుమూసాడు. మా తండ్రి నూటపది సంవత్సరాలు జీవించి, అనాయాసంగా వెళ్ళిపోయాడు. నాకిప్పుడు వందేళ్ళు. ఎలాంటి అనారోగ్యమూ లేదు. ముసలివాడిననే భావమే నాకు కలగదు. మరొక పాతికేళ్ళు తప్పక జీవిస్తానని నా నమ్మకం. మరి అలాంటప్పుడు మానవునికి స్వయంకృతంగా సంక్రమించే వ్యాధులకు సృష్టికర్తను నిందించటం సబబుకాదు గదా! మాకు నువ్వేమి లోటు చేసావని? ఈ గాలి, ఈ నీరు, ఈ భూమి, ఈ ఆకాశం, సూర్యుడు, చంద్రుడు... ఇవన్నీ నీవిచ్చిన అనంతసంపదలే గదా! ఒక్కగింజ వేస్తే వందల గింజలు పండేలా అనుగ్రహిస్తున్నావే. ఇంత కంటే ఏంకావాలి?" అంటూ నమస్కరించాడు.

బ్రహ్మదేవుడు చాలా సంతోషించి, "ఓ మహానుభావా! బ్రహ్మనై ఉండీ బ్రహ్మానందం అంటే ఏమిటో మర్చిపోయిన నాకు అదేమిటో ప్రత్యక్షంగా చూపించావు. నీవిచ్చిన ఈ ఆనందంతో నేను నా సృష్టికార్యాన్ని మరికొన్ని మహాయుగాలు కొనసాగిస్తాను. నీకేమైనా వరం ఇద్దామనుకుంటున్నాను కోరుకో" అన్నాడు.

ఆ వ్యక్తి నవ్వుతూ బ్రహ్మకు నమస్కరించి, ఇలా అన్నాడు. "నన్ననుగ్రహించి, నీ నిజరూపంతో నాకు సాక్షాత్కరించావు. ఇంతకన్నా నాకేం కావాలి. నన్నెప్పుడూ ఇలాగే ఇదే స్థితిలో ఉండేలా ఆశీర్వదించు చాలు" అన్నాడు.

ఆకాశం నుంచి మధురమైన సంగీతం వినబడింది. పూలవాన కురిసింది.

బ్రహ్మదేవుడు తృప్తిగా తన లోకానికి చేరుకున్నాడు.

చిన్నా అక్షరాభ్యాసానికి కావలసిన సరంజామా లిస్ట్ భర్త సుదర్శన్ కిచ్చింది శారద. రేపే అక్షరాభ్యాసం. ఎల్లుండి కాన్వెంట్‌లో ఎల్‌కేజీ లో చేర్పించాలి. వారం రోజుల క్రితమే కాన్వెంట్ కెళ్ళి వివరాలు తెలుసుకొని వచ్చాడు సుదర్శన్.

ఐదువేలు డొనేషన్, నెలకు మూడు వందలు ఫీజు. అప్లికేషన్‌తో బర్త్ సర్టిఫికేట్ జత చేయాలని చెప్పారు.

మునిసిపల్ ఆఫీస్‌లో బర్త్ సర్టిఫికేట్ కోసం దరఖాస్తు యిచ్చి అటునుంచి అటే మార్కెట్‌కెళ్ళి పూజ సామాగ్రి తేవాలని నిర్ణయించుకొని సుదర్శన్ బయలుదేరేలోగా కరంట్ పోయింది.

ఎదురింటిలోనూ, పక్కింటిలోనూ కరంట్ ఉన్నా తమ యింటిలోనే పోయింది. ఫ్యూజ్‌లన్నీ బాగానే ఉన్నాయి. అంటే పోల్‌మీద కనక్షన్ ఊడిందన్నమాట. సంబంధిత శాఖకు ఫోన్ చేయాలనుకున్నాడు సుదర్శన్. కానీ రేపే పూజ. అతిథులొస్తారు. కరంట్ లేకుంటే యిబ్బందని సుదర్శన్ తండ్రి తనే స్వయంగా వెళ్ళి లైన్‌మాన్‌ని వెంటబెట్టుకు వచ్చాడు.



# దైవపాలన

అతగాడు వస్తూనే జేబులోంచి ఆకుపచ్చ గుడ్డతీసి, ముడుపు కట్టమన్నాడు. "ముడుపా? ఎందుకూ? ఏమిటీ?" ఆశ్చర్యపోయాడు సుదర్శన్.

"ఇది దైవపాలన కదా సాబ్! మా ఆఫీస్‌లో మూడు మతాలున్నారు కొందరికి పసుపు గుడ్డల ముడుపు యివ్వాల. కొందరికి ఎర్ర గుడ్డలు నాకు ఆకుపచ్చ" అని వివరించినా సుదర్శన్‌కి అర్థం కాలేదు.

ఓరి అమాయకుడా! అన్నట్టు అతని వైపు చూసి "ఏవో కోర్కెలతో గుడికెళ్ళి, కోర్కె తీరాక ముడ్పు చెల్లించి, గుండు గీయించుకోరా సాబ్? అదే విధంగా కరంట్ కావాలన్న కోర్కె తీరాలంటే ముడ్పు కట్టాల. గుండు మీ యిష్టం" వివరించాడు లైన్‌మాన్.

"ప్రభుత్వం మీకు జీతం ఇస్తోంది. ఇది మీ డ్యూటీ. మళ్ళీ ముడుపెందుకు" లా పాయింట్ పీకాడు సుదర్శన్.

"ఆఫీస్కెళ్ళి, దస్కత్ సేసి, కూకోడానికే జీతం! కోరిక తీరాలంటే ముడ్పు కట్టాల! దైవపాలన సాబ్!" నవ్వాడు లైన్ మానవుడు.

అయిష్టంగానే "ఎంత?" అని అడిగాడు సుదర్శన్.

"గుడిలో దర్శనం, స్పెషల్ దర్శనం ఉండవా? అలాగే" మళ్ళీ నవ్వాడు.

"గుడిలో ధర్మదర్శనం కూడా వుంటుంది" ఉక్రోషంగా అన్నాడు సుదర్శన్.

"అయితే మీ చేతికి ధర్మచక్రం కట్టి పోతాన్లే. అందల ప్రయారిటీ నంబర్, తేదీ ఉండు. ఆ ప్రకారం వచ్చెద" సంచిలోంచి చక్రం తీసాడు లైన్‌మానవుడు. దాని మీద నెల తర్వాత తేదీ ఉంది. సుదర్శన్ గుండె గుభేల్ మంది.

సుదర్శన్ తండ్రి ముందుకొచ్చి ఇరవై ముడుపు కట్టాడు.

"ఎల్లుండి వస్తాసాబ్" ముడుపు జేబులో పెట్టుకుని బయలుదేరబోతున్న లైన్ మానవుడిని ఆపాడు తండ్రి.

"గుడిలో సాధారణ, స్పెషల్, సూపర్‌స్పెషల్ దర్శనాలుండుగదా. ఆ విధమున ఇరవైకి రెండు రోజుల తర్వాత, యాభైకి ఒకరోజు తర్వాత, వందకి తక్షణం కనక్షన్ దొరకబడును సాబ్" వివరించాడు లైన్ మానవుడు.

ఏడుస్తూ లైనేశ్వరుడికి వందరూపాయిల ముడుపు చెల్లించి, మునిసిపల్ ఆఫీస్‌కి బయలుదేరాడు సుదర్శన్.

మునిసిపల్ ఆఫీస్ కొత్తగా కనిపించింది. ఒకప్పుడు జనం తీర్థ స్థలంలాగ తండోపతండాలుగా చెట్ల కింద, రాళ్ళగుట్టల మీద నిరీక్షిస్తూ రేపురా, మాపురా అని తిప్పుతున్న సిబ్బందిని తిట్టుకుంటూ ఉండేవారు. ఇప్పుడు చెట్లు, గుట్ట

ప్రఫుల్ల చంద్ర

లూ ఖాళీగా ఉన్నాయి! అలా పది అడుగులేసి కొత్తగా ఏర్పాటు చేసిన రిసెప్షన్ గదిలో చూస్తే అక్కడ కుర్చీల్లో ఓ పాతిక మంది వరకూ నిరీక్షిస్తున్నారు.

ఆ కుర్చీల కెదురుగా వున్న టేబుల్ మీద ఒక ప్రక్కగా బ్యాలట్ బాక్స్‌ల్లాంటివి మూడు వున్నాయి. వాటి మీద సాధారణ, ప్రత్యేక, తత్కాల్ అని రాసిన కాగితాలు అంటించి ఉన్నాయి. టేబుల్ వెనక కుర్చీలో క్లర్క్ కూర్చుని ఉన్నాడు. అతని ఎదుట ఒక రిజిష్టర్, కవర్లు, గమ్‌బాటిల్ ఉన్నాయి.

ఆ క్లర్క్ హుషారుగా కబుర్లు చెబుతూ చకచకా పనిచేస్తోంటే మునిసిపల్ సిబ్బంది చకచకా పనిచేయడమా? అని దిగ్భ్రమ చెందిన సుదర్శన్ తన వంతు రాగానే వెళ్ళి క్లర్క్‌కి విషయం వివరించాడు.

"మీకేది కావాలి?" అంటూ బ్యాలట్ బాక్స్‌ల వైపు చూపించాడు క్లర్క్.

"అయ్యో! నాకు బ్యాలట్ బాక్స్ వద్దండీ! బర్త్‌సర్టిఫికేట్ కావాలి"

ఆ క్లర్క్ గలగలా నవ్వుకొని "మీ వివిధ కోర్కెలు ఒక్కొక్క దానికీ మూడురకాల రేట్లు ఉంటాయి. బర్త్ సర్టిఫికేట్‌కి ఆర్డినరీ అయితే యాభై రూపాయలు. రెండు నెలల్లో సర్టిఫికేట్ యిస్తాం. స్పెషల్ అయితే వంద. రెండు వారాల్లో పని జరుగుతుంది. తత్కాల్ అయితే మూడొందలు. గంటలో యిచ్చేస్తాం" వివరించాడు.

అతడు వివరిస్తూ ఉండగానే అటెండర్



కన్నోజు లక్ష్మీకాంతం వ్రాసిన "చార్మినార్ నానీలు" పుస్తకాన్ని డా॥ ఎన్.గోపిగారు ఆవిష్కరిస్తున్న చిత్రం. ఎడమనుండి: శ్రీ టి. భీష్మాచారి, ఆచార్య శరత్‌జ్యోత్స్నారాణి, శ్రీ కన్నోజు లక్ష్మీకాంతం (రచయిత), డా॥ మసన చెన్నప్ప (అధ్యక్షులు), డా॥ ఎన్.గోపి, శ్రీ సుధామ, డా॥ తిరునగరి




వచ్చి అక్కడ నిరీక్షిస్తున్న కొందరికి సర్టిఫికేట్లు యిచ్చి తత్కాల్ బాక్స్ తీసుకెళ్ళాడు.

"చూసారుగా! ఆ బాక్స్‌ని అరగంట కొకసారి పెద్దసారువాడి వద్దకు తీసుకెళ్తాడు. మరో అరగంటలో సంతకాలతో వస్తాయి. ఈ బాక్స్‌ని రెండు వారాలకొకసారి, దీన్ని రెండు నెలల కొకసారీ పెద్ద సారువాడికి పంపుతాం" చెప్పాడు క్లర్క్.

నీరసంగా అతని చేతిలో మూడొందలు పెట్టాడు సుదర్శన్. ఆ డబ్బుని కవర్లో పెట్టి, అంటించి, కవరు మీదా రిజిష్టర్‌లోనూ ఏదో రాసి తత్కాల్ డబ్బా రాగానే దానిలో వేసాడు క్లర్క్. అప్పటికి పని ఒత్తిడి తగ్గి, కబుర్లకు తీరిక చిక్కగా బద్ధకంగా ఒళ్ళు విరచుకొని –

"ఇదంతా ఎంతో అన్యాయంగానూ, ఘోరంగానూ అనిపిస్తోంది కదూ" అని నవ్వేసి "ఇంతకుముందు లంచం అనేవారు. తీసుకునే వాడికి జంకు, ఇచ్చేవాడికి బెరుకుగా ఉండేది. పని అవుతుందో లేదో గ్యారంటీ ఉండేది కాదు". ఆ లంచ భాగ్యం కొన్ని సీట్లకే పరిమితం. దాంతో లాభదాయక సీట్లకోసం మాలో మాకే పోటీ ఉండేది. ఇప్పుడు దైవపాలన వచ్చాక అంతా పబ్లిక్కే. పారదర్శకమే. అందరికీ హ్యాపీస్. అన్నిపనులకూ అందుబాటు రేట్లు, కాలనియమం ఉన్నాయి. పని జరుగుతుందన్న గ్యారంటీ ఉంది. ముడుపులెంత వస్తున్నాయో ఖచ్చితమైన లెక్క ఉంటుంది. అందరికీ పెర్సంటేజ్ ప్రకారం వాటాలుంటాయి. ఇది దైవపాలన. రాక్షస పాలన కాదుకదా. అందరూ హ్యాపీస్" దైవపాలన లాభాలు వివరించసాగాడు.

ఏడవలేక నవ్వాడు సుదర్శన్.

ఆ ముఖం చూసి ముచ్చట పడి టీ తెప్పించి యిచ్చాడు క్లర్క్.

తర్వాత కన్నుగీటి, రహస్యంలాగ తగ్గుస్వరంలో చెప్పాడు "సూపర్ తత్కాల్ అని మరో పథకం వుంది. పనిని బట్టి దానికి సూపర్ రేట్లు

ఉంటాయి. బర్త్ సర్టిఫికేట్ కోసం వెయ్యి రూపా యిలిస్తే చాలు. సంతకం పెట్టి బ్లాంక్ సర్టిఫికేట్ యిచ్చేస్తాడు పెద్దసారువాడు. ఖాళీల్లో మీయిష్టం వచ్చిన పేరు, యిష్టం వచ్చిన తేదీ మీరే పూర్తి చేసుకోవచ్చున్నమాట."

వింటోంటే దిగ్భ్రాంతిగా ఉంది సుదర్శన్‌కి. చుట్టూ చూసి యింకాస్త దగ్గరగా రమ్మన్నట్టు సైగ చేసాడు క్లర్క్.

"ఒకసారి ఏం జరిగిందంటే – ఒక పెద్దమనిషి సూపర్ తత్కాల్ డబ్బు కట్టి పెద్దసారువాడి సంతకం ఉన్న కాగితం మీద – నేనొక చవటని! లంచగొండిని! నా బిడ్డలు నిజంగా నాకు పుట్టినవారు కాదు. పక్కింటి వాడికి పుట్టారు! – అని రాసి దాని కాపీలు తీసి దినపత్రికలకు, టీవీ ఛానల్స్‌కీ పంపి నానా రభస చేసాడు!" చెప్పి పకపకా నవ్వేసాడు క్లర్క్. తర్వాత నవ్వు ఆపి–మరింత రహస్యంగా–

"పెద్దసారువాడు తక్కువ తిన్నాడా? తెలివైన ముండావాడు లెండి! సూపర్ తత్కాల్ కాగితాల మీద వేరే విధంగా సంతకాలు పెడతాడు! పేపర్లలో, టీవీల్లో తన పేరు మారుమోగుతోంటే ఆయన పోలీసు స్టేషన్ కెళ్ళి భారీ ముడుపు కట్టి – అది నా సంతకం కాదు, ఫోర్జరీ చేసారంటూ కేసుపెట్టాడు. దాంతో రభస చేసిన పెద్ద మనిషి జైలుకీ, పెద్దసారువాడు పార్టీకి!"

కిమ్మనకుండా, ముడుపుకోరకుండా ఫ్రీగా వినేవాడు దొరకడం ఎంత అదృష్టం! క్లర్క్‌కి హుషారుగా వుంది. అదీ కాక రద్దీలేదు. దైవపాలన గురించి జనాభిప్రాయాన్ని అనుకూలంగా మలచవలసిన గురుతరబాధ్యత తన భుజస్కందాల మీద ఉందని ఫీలయి, "ప్రజలు అనవసరంగా గోలచేస్తున్నారు. ఆ రెండు పత్రికలూ, ఆ ఒక్క న్యూస్ ఛానల్ రభస చేస్తున్నాయిగానీ సరస్వతి అమ్మవారు విద్యాలయాల్లో దైవపాలన ఎప్పుడో మొదలుపెట్టెయ్యలేదా? రేపు మీ అబ్బాయి కాన్వెంట్‌లో చేరేటప్పుడు డొనేషన్ కట్టడంలేదా? అక్కడ డొనేషన్, బిల్డింగ్ ఫండ్, కాపిటేషన్ ఫీజు అని ముద్దుముద్దుగా ఇంగ్లీషులో చెబుతున్నారు. ఇక్కడ మొద్దు మొద్దుగా ముడుపు అని తెలుగులో అంటున్నందుకు బాధగా ఉందా? అక్కడ యిష్టంగా వేలకు వేలు ఒక్కోసారి లక్షలు కూడా చెల్లిస్తూ ఇక్కడ వందలు యివ్వడానికి కష్టం ఎందుకుసార్?" అంటూండగానే – అటెండర్ సర్టిఫికేట్ తెచ్చి సుదర్శన్ కిచ్చాడు.

ఈ పద్ధతి బాగానే ఉన్నట్టు అనిపించింది సుదర్శన్‌కి. హృదయం తేలికపడింది. "ఉత్తుత్తి జీవో లాగ యిది ఉత్తుత్తి సర్టిఫికేట్ కాదుకదా!" సాక్ చేసాడు.

పకపకా నవ్వేసాడు క్లర్క్. తర్వాత చటుక్కున జ్ఞాపకం వచ్చినట్టు "మాస్టారూ! కార్యసాఫల్యం అయిందికదా. ప్రక్క సెలూన్‌లో గుండు గీయించుకొని, ఆ ప్రక్క కొలనులో స్నానం చేసిపొండి. గుండు వల్ల ఒక ప్రయోజనం ఉంది సుమా" అన్నాడు.

"ఔను! కొబ్బరి నూనె మిగులు" మళ్ళీ జోక్ చేసాడు సుదర్శన్.

"అదిసరే ఇంకో ప్రయోజనం ఉంది. దువ్వుకోడానికి వీలైనంత పొడవైన జుట్టు మీ గుండు మీద మొలిచేవరకూ మునిసిపల్ ఆఫీసుతో మీకెన్ని పనులు పడినా అన్నిటిమీదా తత్కాల్ ముడుపులో సగం రాయితీ యిస్తాం!" ఘనంగా ప్రకటించాడు క్లర్క్.

ఇది మరీబాగుంది అనిపించింది సుదర్శన్‌కి. కానీ స్నానం చేయాలంటే వేరే బట్టలు లేవు. ఆలోచిస్తూ సెలూన్ పక్క నుంచి వెళ్తోం




టే సెలూనయ్య పిలిచాడు. కట్టుకొని స్నానం చేయడానికొకటి, తర్వాత తుడుచుకోడానికీ తువ్వాళ్ళు అద్దెకు దొరుకుతాయని చెప్పాడు. ఈ ఏర్పాటు బాగానే ఉందనిపించి గుండు గీయించుకొని, తువ్వాలు మొలకి చుట్టుకొని, బట్టలు కొలను మెట్టుమీద పెట్టి నీటిలో దిగాడు సుదర్శన్.

స్నానం చేస్తూ మెట్టువైపు చూడగా అతని గుండె ఝల్లుమంది.

ఎక్కడ నుంచి వచ్చిందోగానీ ఒక కోతి రాజా బట్టల వద్దకూర్చుని జేబులు చెక్‌చేస్తోంది! అది బట్టలు ఎత్తుకుపోతే తనపని గోవిందా! గుండె గుబగుబలాడుతోంటే గబగబా స్నానం ముగించి, మెట్టుమీదకొచ్చి కోతిరాజాని అదిలించాడు. అంతే... అది షర్ట్ జేబులోని బర్త్ సర్టిఫికేట్ చేజిక్కించుకొని, పక్క యింటి మీదకు హైజంప్ చేసింది.

"నా సర్టిఫికేట్! నా సర్టిఫికేట్!!" అని అరుస్తూ అక్కడకు పరిగెత్తాడు సుదర్శన్. ఆ కోతి రాజా సుదర్శన్‌ని చూసి డాన్స్ కోతీ డాన్స్ టీవీ ప్రోగ్రామ్ లాగ డాన్స్ చేస్తూ మరింత ఎత్తయిన భవనానికి జంప్ చేసింది.

వెర్రిగా అరుస్తూ అక్కడికి పరుగు తీసాడు సుదర్శన్.

నీ లెక్కేంటి అన్నట్టు అతనివైపు ఒక లుక్ పారేసి, అచ్చం కోతిలాగ పళ్ళికిలించి నవ్వుతూ చిద్విలాసంగా ఆ సర్టిఫికేట్‌ని ఉండ చుట్టి నోట్లో వేసుకుంది కోతిరాజా.

కాయా, కసరూ తినవలసిన కోతి కాగితం తినేస్తోంటే దీనికిదేంపొయ్యే కాలం అని సుదర్శన్ లబలబ లాడుతూండగా –

"ఏమండీ, లేవండీ... ఏమిటా కలవరింతలు? పీడకలగానీ వచ్చిందా? చిన్నాకి అక్షరాభ్యాసం కదా! పంతులుగారు వచ్చే టైమ్ అవుతోంది. అబ్బా... లేవండీ" భర్తని కుదిపి కుదిపి లేపుతోంది శారద. ●

"పట్టపగలే పెళ్లాంతో సరసాలేమిట్రా భడవా...? దేనికైనా కాస్తంత చాటు మాటు అవసరం! తలుపేసుకుని ఏడవండి..." సుతిమెత్తగా వడ్డించింది బామ్మ.

"నీకు వయసు మీదపడినా ఇసుమంతైనా చూపుతగ్గలేదే బామ్మా! అద్సరేగానీ నాకు తెలీక అడుగుతా... పాపాయి తాళికట్టించుకున్న భార్య. అలాంటప్పుడు తప్పేంటి? పక్కింటోడి పెళ్లాంతో నేనేం సరసమాడటం లేదుకదా... మధ్యలో నీకేంటిట బాధ?" కాస్తంత హాస్యాన్ని మేళవించి ఘాటుగానే జవాబిచ్చాడు చంటి.

చంటి బామ్మగారి మనవడు. గారాలపట్టి.

"కొంపదీసి ఆ పనిగాని చేసేవ్. పక్కింటి పిల్ల మొగుడు పోలీసోడు. వెధవ్వేషాలేస్తే మక్కెలిరగ్గొడతాడు."

బామ్మ మాటలు తిట్లో దీవెనలో అర్థమై చావలేదు చంటికి.

"ఇదిగో పిల్లా...వేళాపాళా లేకుండా మంచ మెక్కావంటే నాక్కోపమొస్తుంది. ఎంత కొత్తగా పెళ్లయిన జంటయినా విరగబాటు పనికి రాదు."



# బామ్మగారి భాగోతం

బామ్మగారి మాటలు చురుక్కుమనడంతో చంటి పక్కనే పందిరిమంచం మీదున్న పాపాయి పక్కకు జరిగి దిగబోతుంటే పైటపుచ్చుకుని మీదికి లాక్కొన్నాడు.

"అబ్బ! ఉండండీ..." అంటూ గోముగా గింజుకుంది పాపాయి. "మీకు అంతా తొందరే. ఉండండి తలుపేసి వస్తా... అవతల పెద్దావిడ చూస్తోంది..." అంటూ మంచం దిగొచ్చి గది తలుపేసి గడియ పెట్టింది పాపాయి.

వయసొచ్చిన పిల్లాడు ఎక్కడ చెడిపోతాడోనని 'లా' పూర్తికాగానే చంటికి పెళ్లిచేసి, తన బాధ్యత తీర్చుకుంది బామ్మ. అప్పుడే పెళ్లి దేనికని చంటి నెత్తీనోరూ మొత్తుకున్నా ససేమిరా వినలేదు. పెళ్లి చేసుకోవాల్సిందే... తన కళ్ల ఎదుట వుండాల్సిందే అని శాసించింది. కాస్తంత మెత్తబడిన చంటి బామ్మ మాట జవ దాటలేకపోయాడు.

బామ్మంటే చాలా ప్రేమ చంటికి. పసితనం నుంచీ కంటికి రెప్పలా పెంచి తనను సాకింది. తల్లీతండ్రి లేని లోటు తీర్చింది. చదివించింది.

"ఇదిగో పాపాయ్! నా మనుమడికి కాఫీలు, టీలూ ఇచ్చేవుగనక... వాడి ఆరోగ్యం అటకెక్కుతుంది. పెళ్లి అయ్యేదాకా మనవడికి ముప్పొద్దులా మాదాకవళమే పెడుతున్నా - అర్థమైందా? అంతగా కావాలంటే నేతిగారెలు... ఆవిరి కుడుములు చేసిపెట్టు. నువ్వు నీళ్లోసుకునే నాటికి నా మనుమడు రుబ్బురోల్లా తయారవాలి. తెల్సిందా?" చాటలో ఉన్న బియ్యంలో రాళ్లేరుతున్న బామ్మ ఎదురుగా కూర్చున్న పాపాయితో అంది.

బామ్మ చెప్పే మాటలు శ్రద్ధగా వింటూ మరబొమ్మలా తలాడించింది. బదులు చెప్పడానికి ధైర్యంచాల్లేదు. బామ్మ మాట్లాడే ప్రతి మాటా... బెత్తంతో వీపుమీద చురకేసినట్టుంటుంది.

"నా వంటికి వరన్నం పడిచావదు. తెల్ల జొన్నలు పనివాళ్లతో దంపించి ఉడకేసిపెట్టు చాలు" ఉలుకూ పలుకూ లేకుండా ఎదురుగా కూర్చున్న పాపాయి ముఖంలోకి చూస్తూ మాట్లాడింది బామ్మ.

అందుకే కాబోలు ఎనభయ్యోపడిలో కూడా పిడిరాయిలా ఆరోగ్యంగా ఉంది బామ్మ అనుకుంది పాపాయి.

అక్కడి నుంచి లేచివెళ్లేందుకు ధైర్యం చాలడంలేదు. మరోవైపు చంటి తనను రమ్మంటూ పిలుపు. అడకత్తెర్లో పోకచెక్కలా ఉంది పాపాయి పరిస్థితి.

ఆలస్యానికి తాళలేక గబగబా బెడ్‌రూమ్‌లోనుంచి వచ్చి "అయిందా నీ 'తాషామరపా' వాయింపు. అసలే నువ్వంటే బెదిరి చస్తోంది. నోరు విప్పలేకపోతోంది పాపాయి. ఇవాల్టికి దాన్నొదిలెయ్. నువ్వురావే..." అంటూ పెళ్లాన్ని చేయి పుచ్చుకు గదిలోకి బరబరా ఈడ్చుకెళ్లినంత

**యస్. వివేకానంద**

పన్చేసాడు చంటి.

హఠాత్పరిణామానికి అవాక్కయింది బామ్మ.

★ ★ ★

షర్ట్ తగిలించుకుని లుంగీతో వీధిలోకెళ్ల బోతున్న చంటిని చూస్తూ "సూరీడు నడినెత్తికొచ్చాడు. ఇప్పుడెక్కడికిరా?..." నిలదీసినట్లడిగింది చంటిని.

నోరు పెగల్లేదు చంటికి.

"నాకు తెల్సులే. ఏ బీడీముక్కో తగలేసి రావడానికై ఉంటుంది. ఆ మాత్రం తెల్సుకోలేనను కున్నావా? చూడూ! సిగరెట్లు ఊదీ ఊదీ కేన్సరొచ్చి మీ నాన్న 'హరీ' అన్నాడు. నువ్వట్లాంటి వెధవపన్లు చెయ్యొద్దు. అర్ధమైందా?" చంటి ముఖంలోకి చూస్తూ గద్దించి గుడ్లురుమింది.

అసలు తనకు స్మోకింగ్ అలవాటు లేదు. బామ్మదంతా అనవసరపు అపోహ. తిరిగి బదులిస్తే మీదపడి రక్కేస్తుందనిపించి సైలెంట్ అయిపోయాడు.

"వంటైపోయింది. మరో పది నిముషాల్లో ఇద్దరికీ వడ్డించేస్తాను. దొడ్లోకెళ్లి కాళ్లుకడుక్కురండి..." అనేసి వంటింట్లోకి నడిచింది.

చంటి కాళ్లకు బ్రేకులు పడడంతో వీధిలో కెళ్లే పని విరమించుకుని భార్యని భోజనానికి రమ్మని చేయిపుచ్చుకురావడానికి గదిలోకెళ్లాడు.

చంటి, పాపాయీ వచ్చి పీటల మీద కూర్చునే సమయానికే... కందిపచ్చడి, కొత్త ఆవకాయ, బంగాళాదుంప వేపుడుతో కంచాల్లో పదార్థాలు సాక్షాత్కరించినయ్.

చంటి కందిపచ్చడి వేడివేడి అన్నంలో కలిపి మధ్య మధ్య ఆవకాయ నాలిక్కి రాసుకుంటూ ముద్దమీద ముద్ద లాగించడం చూస్తున్న పాపాయి విస్తుపోయి మొగుడివంకే చూస్తోంది.

"ఏమిటా చూపు?... దిష్టి తగిలేను. ఇష్టమైన పదార్థాన్ని కలుపుకుని ఆబగా తినడం చంటికి అలవాటు. రోజూ కందిపచ్చడి రుబ్బి కంచంలో వేసినా కాదనడు. అదంటే వాటికి అంత ఇష్టం. ఆవకాయ, బంగాళాదుంప వేపుడంటే ప్రాణం! నీ మొగుడి ఇష్టాఇష్టాలు తెల్సుకుంటూ ఉండు. రేపు నేను 'హరీ' అంటే... అన్నీ సమర్థించుకోవలసిందానివి నువ్వే..." అంది బామ్మ.

పాపాయి చేతివేళ్లు కంచంలో ఆడడం గమనించిన బామ్మ "ఇదిగో పిల్లా! సుకుమారంగా అలా వేళ్లు ఆడిస్తావేంటి కంచంలో? పచ్చడి కలుపుకో... నెయ్యి వడ్డిస్తాను. కడుపునిండా తినడం నేర్చుకో!... ఊ... కానీ..."

బామ్మ మాటల్లో గదమాయింపు మాత్రమే కాక అంతకు మించిన ఆత్మీయత చోటుచేసుకున్న సంగతి పాపాయి గ్రహించింది.

చదువు లేకపోయినా బామ్మకా దేవుడు బోల్డన్ని తెలివితేటలిచ్చాడు. పంటపొలాలు... ఆస్తిపాస్తుల వ్యవహారాలన్నిటినీ బామ్మ మేనేజ్ చేయగలుగుతున్నదంటే మామూలు విషయం కాదు.

డబ్బు వడ్డీలకి తిప్పుతుంది. వస్తువులు కుదవపెట్టుకుని అప్పులిస్తుంది. పేదవాళ్లనుకుంటే ఉచితంగా సహాయం చేస్తుంది. బామ్మలో మంచీ చెడు, దేవుడు - భక్తి, పూజ - పునస్కారం అన్నీ ఉన్నాయ్.

కొడుకు, కోడలూ ఏడాది తేడాతో కన్నుమూసారు. భర్త చిన్ననాడే పోయాడు.

తాను వంటరి మనిషిననే వాస్తవాన్ని గుర్తిం






చి, అప్పటినుంచీ అన్నిపన్లూ చక్కదిద్దుకురావడం ఆమె తెలివికి తార్కాణం.

చంటికేలోటూ రానీలేదు. ఏది కోరితే అది ఇచ్చింది. చదువు చెప్పించి ఓ ఇంటివాడిని చేసింది.

ఆమె కోరికల్లా... తాను కళ్లుమూసేవరకూ మనవడు తన ఇంట్లోనే ఉంటూ తన కళ్లఎదుటే తిరగాడాలి. చంటి చేతిలో తాను కన్నుమూయాలి. అంతకు మించిన కోరికలేమీ బామ్మలో లేవు.

లంకంత పెంకుటిల్లు. ఓ కలర్ టీవీ., సిటీకెళ్లి చదువుకొనేందుకు స్కూటర్ చంటికి కొనిచ్చింది.

ఇన్ని చేసిన బామ్మ... చంటి సిటీలో లాయర్ ప్రాక్టీస్ చేస్తానంటే మాత్రం సుతరామూ వప్పుకోలేదు. మనుమడు తనకు ఎక్కడ దూరమైపోతాడోననే బెంగ!

ఎన్నో ఏళ్లుగా ఉంటున్న ఇంటిని, సిరిసంపదలున్న ఊరినీ వదిలి వెళ్లడానికి బామ్మకి బొత్తిగా మనస్కరించదు.

పళ్లూడలేదు, చూపు మందగించలేదు, నడుము వంగలేదు. ఆమె ఆరోగ్యం చూసి ఎదుటివాళ్లు ఈర్ష్యపడతారు.

పాపాయి కొత్తగా కాపురానికి రాగానే విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది. కందిపొడి, ధనియాలపొడి, కొబ్బరిపొడి, కారప్పొడి అన్నా... వేపుడు కూరలన్నా... ముద్దపప్పన్నా చంటికెంతో ఇష్టమని చెప్పింది.

బామ్మ అనుభవాలు ఓ పేద్ద నిఘంటువు. ఇన్నేళ్లొచ్చినా స్నానంచేసి మడిబట్ట ధరించి, దేవుడికి దీపారాధన చేసి నైవేద్యం పెట్టాల్సిందే. ఆ తర్వాతే ఏ పనైనా!

'ఎత చకని సుతుడే యశోదపుతుడు... కాత లార గాచివతమురదు...' అంటూ రాగాలా

పనతో బామ్మ పాడేపాట అర్ధంకాక చంటి నడిగింది పాపాయి.

పేద్దగా నవ్విన చంటి "నీకేంటీ... చిన్నప్పుడు నాకూ అర్ధంకాక తల బద్దలుకొట్టుకునేవాడిని. తర్వాత గ్రహించాను ఆ పాట తీరేమిటో..." అన్నాడు.

"అబ్బ! సస్పెన్స్‌తో చంపక... అదేమిటో త్వరగా చెప్పండీ ..." గోముగా అడిగింది.

"ఎంత చక్కని సుతుడే యశోదపుత్రుడు... కాంతలార కాంచివత్తమురండి..." అనేది అసలు పాటకున్న చరణం. బామ్మకి వత్తులు... పొల్లులు... దీర్ఘాల వంటివి తెలీవు కాబట్టి నోటికొచ్చినట్లు పాడేయడం అలవాటైంది. అండర్‌స్టాండ్!..." విపులీకరించాడు చంటి.

సమాధానం విన్న పాపాయి పకపకా నవ్వింది.

ఇంట్లో సర్వాధికారాలూ బామ్మవే! పెత్తనమంతా ఆవిడదే. ఆమె గీచిన గీటు దాటడు చంటి. పిసినారి కాకపోయినా డబ్బు విషయంలో గట్టిమనిషి! మనిషిలో పట్టుదల అధికం. పాపాయి బాధల్లా తనకా ఇంట్లో ఫ్రీడమ్ లేకుండా పోతోందేనని. నచ్చినా నచ్చకపోయినా సర్దుకుపోక తప్పడంలేదు.

పల్లెటూర్లో ఇరవైనాలుగ్గంటలూ ఇంటికే అంకితమైపోవాలంటే పాపాయికి బోరన్పిస్తోంది. ఎంతసేపని టీవీ చూస్తుంది? అప్పటికీ తనకోసమని సిటీ నుంచి న్యూస్‌పేపర్... వీక్లీలూ తెప్పిస్తున్నాడు చంటి. అయినా ఏదో అసంతృప్తి పాపాయిని వెంటాడుతోంది. హౌస్ అరెస్టులా ఉంది.

మధ్యాహ్నం భోజనాలయ్యేక చంటి, పాపాయీ బెడ్‌రూమ్‌లోకెళ్లి విశ్రాంతి తీసుకుంటున్నారు.

బామ్మ ఆ పనీ ఈ పనీ చేస్తూ ఉండిపోయింది.

రెండు గంటల సమయంలో బామ్మకేం గుర్తొచ్చిందో ఏమో... చంటినీ, పాపాయినీ కేకేసి పిలిచింది.

వాళ్లిద్దరూ వచ్చి దగ్గరగా నిలబడగానే "మీ ఇద్దరికీ ఓ ముఖ్యమైన విషయం చెప్పాలన్పించి పిల్చాను. ఈ రోజు పాడ్యమి. వర్జ్యంలేదు. కాబట్టి..."

"ఇప్పుడీ సోదం తా దేనికే బామ్మా?" వీపు గోక్కుంటూ నొసలు చిట్లించి నిద్ర చెడిపోయిందేనన్న విసుగుతో అన్నాడు చంటి.

"పిచ్చి సన్నాసీ!... చదువైంది. పెళ్లీ చేసుకున్నావ్. ఇక ఈ ఇంటి పెత్తనం నాకు దేనికి? నువ్వూ పాపాయీ చేసుకోండి. నేను కృష్ణా - రామా అనుకుంటూ వుంటాను..."

ఆ మాట వినగానే బిత్తరపోయిన చంటి, పాపాయి ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు.

ఇనప్పెట్టె తాళాల గుత్తి పాపాయికి అందిస్తూ "దీన్ని తెరవ్వే మనమరాలా..." అంది బామ్మ.

ఎంత ప్రయత్నించినా దాన్ని తెరవడం పాపాయికి చేతకాలేదు. చంటి కూడా ప్రయత్నించి ఫేలైనాడు.

"మీకు అన్నీ తెలుసనుకుంటారు. ఇనప్పెట్టె తెరవలేకపోయారు..." అంటూ నవ్వేసి "ఇదిగో ఇలా తెరవాలి..." అంటూ ఇనప్పెట్టె డోర్ ఓపెన్ చేసింది.

బంగారం... వెండి... నగానట్రా... నోట్ల




కట్టలు... ప్రాంసరీ నోట్లతో కిక్కిరిసి ఉండడం చూసి పాపాయి నోరెళ్లబెట్టింది.

ఇప్పుడిదంతా దేనికి అన్నట్టు బామ్మ ముఖంలోకి చూసేడు చంటి.

"ఇకపై ఇంటి మేనేజ్‌మెంటు... ఇనప్పెట్టె మేనేజ్‌మెంటూ అంతా మీదే!... ఆ తర్వాత మీ యిష్టం!!" క్లుప్తంగా చెప్పి తాళాలు పాపాయి గుప్పిట్లో ఉంచింది బామ్మ.

పాపాయి గుడ్లు మిటకరించింది.

ఇంతలో పాలేరు పోలయ్య వచ్చి "అమ్మగారూ... అబ్బాయిగోరికి ఉత్తరమొచ్చింది" అంటూ అందించి వెళ్లాడు.

చంటి అందుకుని చదివేడు.

"ఎక్కడ్నించిరా అది" బామ్మ అడిగింది.

"పండక్కి రమ్మని మామగారు వ్రాసారే..."

"అవును కదూ? ఎల్లుండే సంక్రాంతి... ఇంకేం ఉభయులూ బయల్దేరండి..." అంటూ ఇనప్పెట్టె తాళం పాపాయిని వేయమని చెప్పింది బామ్మ.

★ ★ ★

"సారీ అల్లుడూ... నువ్వొచ్చి ఇరవైనాలుగ్గంటలైనా కాకముందే బేడ్‌న్యూస్... నువ్వూ అమ్మాయీ వెంటనే బయల్దేరండి! ఆటో కూడా తెప్పించాను. ఊ... క్విక్..." వెంకట్రామయ్య గారు తన చేతిలో ఉన్న టెలిగ్రామ్‌ని చంటికి అందించారు.

"ఏంటి మామయ్యగారూ... ఎందుకూ తెగ ఫీలైపోతున్నారు" అంటూ టెలిగ్రామ్ చదివాడు.

"వాట్?... బామ్మ చనిపోయిందా?... నో... ఐ కాంట్ బిలీవ్ మామయ్యగారూ..." మేటర్ చదివి నిర్ఘాంతపోయాడు.

"చూడు అల్లుడూ... మనుషుల్ని వున్నపళంగా లాక్కెళ్లిపోతాడా దేవుడు. అందులోనూ

వయస్సు మళ్లినావిడ... లాస్ట్‌బస్ మిస్సయితే మీ ఊరు చేరుకోవడం కష్టం. రెడీ అవండి త్వరగా..." తొందరచేసేరు వెంకట్రామయ్య గారు.

'బామ్మ చనిపోవడమేమిటి? హే భగవాన్... నాకున్న ఒకే ఒక్క పెద్దదిక్కును దూరం చేసావా?...' గొణిగేడు చంటి.

ఆటోలో ఆఘమేఘాలమీద బస్టాండ్ చేరుకున్నారు. ప్లాట్‌ఫారమ్ మీద బస్ రెడీగా ఉంది. వడివడిగా నడుచుకుంటూ వచ్చి బస్సెక్కారు పాపాయి, చంటి.

బామ్మ చనిపోయిందనే వార్త చంటిలో క్షణక్షణానికీ ఆవేదన్ను పెంచుతోంది. పసిపిల్లవాడిలా ఏడుస్తున్నాడు. కర్చీఫ్‌తో కళ్లొత్తుకుంటున్నాడు.

బస్ బయల్దేరింది.

ఇంత సడన్‌గా బామ్మ పోవడమేమిటి? సెంచరీ కొడుతుందనుకున్న బామ్మ... చచ్చిపోవడమా? మనసంతా గందరగోళంగా ఉంది. పక్కనున్న పాపాయి చంటిని ఓదార్చే ప్రయత్నంలో ఉంది.

బస్సు దిగిన చంటి, పాపాయి పరుగులాంటి నడకతో ఇల్లు చేరుకున్నారు.

ఇంటి ముందు ఎవ్వరూ అవుపించకపోవడంతో మరింత ఆదుర్దా, కంగారూ చంటిలో మొదలయ్యాయి.

కనీసం చివరి చూపైనా దక్కలేదా తనకు? దహన సంస్కారాలు చేయవలసిన తాను రాకముందే... అంతా అయిపోవడమేమిటి?

ఇంట్లోకి భార్యాభర్తలిద్దరూ నిర్లిప్తంగా నడిచారు.

మంచంమీద వెల్లకిలా పడుకున్న బామ్మ నిశ్చలంగా నిద్రపోతున్నట్టనిపించింది. కళ్లు మూసుకు పడుకున్న బామ్మని చూస్తుంటే... ఆమె చనిపోయిందంటే నమ్మబుద్ధి కాలేదు చంటికి. కేవలం బామ్మ నిద్రపోతున్నట్టుగా ఉంది.

బామ్మ కళ్లుతెరిచి లేచి కూర్చుని "నాకు తెలుసు మీరొస్తారని..." అనడంతో చంటి, పాపాయి అదిరిపడ్డారు.

చనిపోయిందనుకున్న బామ్మ ఎలా బ్రతికింది? ఏమిటీ తమాషా? నివ్వెరపోయాడు చంటి.

"కంగారు పడకండ్రా! నేనే తంతి ఇప్పించాను"

"చావుతో చెలగాటాలేంటే బామ్మా..." తనూ బామ్మ పక్కనే మంచంమీద కూర్చుంటూ కోపంగా అన్నాడు చంటి.

"మరేం లేదురా అబ్బీ!... కాకులు క్రీడించడం చూసాను. అలా చూట్టం అరిష్టం కదా. చూసినవారు చనిపోయినట్టు వార్త అయినవారికి తెలియజేస్తే... వారు ఏడిస్తే దోషపరిహారమవుతుంది. అందుకే మీకలా తంతి ఇచ్చి రప్పించాను..." అనేసి పెద్దపెట్టున నవ్వింది బామ్మ.

"ఓసి బామ్మా!... నీ 'కాకి చూపు' వెనకాల ఇంత కథుందా!? నువ్వు నిజంగానే పోయావనుకుని బెంగపడ్డాం! నీ మూఢాచారం నాశనమైపోనూ... ఇంకెప్పుడూ ఇలాంటి వెధవపన్లు చెయ్యకు... మా చావుకొస్తుంది..." అంటూ బామ్మకు మెత్తగా చీవాట్లు పెట్టేడు చంటి.

బామ్మ బిక్కముఖం పెట్టింది... పాపాయేమో భర్త మాటలకి ఫక్కున నవ్వింది. ●

తెలుగు పాఠకులకు చక్కని కథలు
అందించాలనే ప్రయత్నంతో ప్రారంభించబడిన

కథాకేళి

# కొత్త రచయితలకు స్వాగతం పలుకుతోంది...

కొత్త రచయితలను ప్రోత్సహించడానికి

# నా మొదటి కథ

శీర్షికను ప్రారంభించామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం.

**కథ వ్రాయాలని ఆసక్తి కలిగి, ఎంతో కొంత వ్రాయగలిగి ఉంటే ఈ శీర్షిక మీ కోసమే. (ఇంతవరకూ 'మీ కథ ఎక్కడా ప్రచురించబడి ఉండకూడద'నేది మాత్రమే నిబంధన)**

**మరింకేం... వెంటనే వ్రాయడం ప్రారంభించండి... మీరూ వ్రాయగలరని నిరూపించుకోండి.**

- మీ కథ ఇంతకుముందు ఏ పత్రికలోనూ (పాఠశాల/కళాశాల మేగజైన్స్ వంటివి మాత్రం ఇందుకు మినహాయింపు) ప్రచురించబడి ఉండకూడదు / పరిశీలనలో ఉండకూడదు.
- కథ సైజుపై పరిమితులేమీ లేవు గానీ తక్కువసైజులో ఎక్కువ విషయం చెప్పగలవారికి అధిక ప్రాధాన్యత ఉంటుందని గమనించాలి.
- మంచి కథావస్తువు కలిగి - కథనం బావుండకపోవడం, ముగింపు అర్థవంతంగా ఉండక పోవడం... వంటి విషయాలను అనుభవజ్ఞులైన రచయితలు పరిశీలించి, సరిచేస్తారు.
- ప్రచురణార్హం కాని కథలను త్రిప్పి పంపించాలంటే తగినన్ని స్టాంపులు అతికించిన కవరుని జత చేయాలి.
- పరిశీలనలో ఉన్న కథల విషయమై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు/ఎంక్వైరీలూ అనుమతించ బడవు.
- ప్రచురించిన కథకు తగిన పారితోషికం ఉంటుంది.
- కథ తన స్వంతమని, దేనికీ అనుసరణ, అనువాదం కాదని, ఇది తన మొదటి రచన అని, ఇంతకుముందు ఏ రచనా (కథ) ఏ పత్రికలోనూ ప్రచురణ కాలేదని హామీ పత్రం వ్రాసి జతచేయాలి.
- కథలను ఎ4/అరఠావు సైజు కాగితాలపై నీట్‌గా ఫెయిర్ చేసి పంపించాలి.

మీ రచనలను ఈ క్రింది చిరునామాకి పంపించండి.
'నా మొదటి కథ', కథాకేళి, సూర్యారావుపేట, విజయవాడ-2.

# ర్యాగింగ్

"ర్యాగింగ్ చేస్తారేమోనే సీనియర్లు" సుజాత భయంగా అంది.

"చేస్తారేమో ఏంటీ? చేస్తారు. అయితే ఏంటి?" అంది ప్రమీల.

"నాకు భయం. వాళ్ళేం చెయ్యమంటారో ఏమో?"

"ర్యాగింగ్ చేస్తారని భయపడితే మనం కాలేజీకి వెళ్ళినట్లే. వాళ్ళేదో చెయ్యమంటారు. మనం సరే అంటే పోతుంది. ఈ గొడవ ఫ్రెషర్స్ డే వరకూ వుంటుంది. ఆ తర్వాత ఏమీ వుండదు" ధైర్యం చెప్పింది ప్రమీల.

అయినా సుజాతకు లోలోపల జంకుగానే ఉంది. ర్యాగింగ్ గురించి ఏవేవో కథలు విన్నది. అవన్నీ గుర్తొచ్చి భయంవేస్తోంది.

"మనం లేటుగా వెళ్దామే." అంది సుజాత.

"లేటుగా వెళ్తే?"

"అప్పటికి అంతా కాలేజీలోకి వెళ్ళిపోయి ఉంటారుగా?"

"నీ మొఖం? ర్యాగింగ్ చేయాలనుకున్న వాళ్ళు హాస్టల్లో మన రూమ్‌కి వచ్చి కూడా చేస్తారు." అంది ప్రమీల.

"మనం ఒంటరిగా కాకుండా, జూనియర్స్ నలుగురైదుగురం గుంపుగా వెళ్దాం. అప్పుడు సీనియర్స్ ర్యాగింగ్ చేయడానికి జంకుతారు." అంది సుజాత.

"సరే అలాగే చేద్దాం."

జూనియర్స్ నలుగురు కలిసి కాలేజీ గేటు దాటి లోపలకు వెళ్ళారు. అప్పటికీ ఆలస్యంగానే బయల్దేరారు. అయినా గ్రౌండ్‌లో అక్కడక్కడా సీనియర్స్ తిరుగుతూనే వున్నారు.

అరడజను మందిఉన్న సీనియర్స్ బ్యాచ్ లీడర్ రాజారామ్ సుజాత వాళ్ళకు అడ్డు పడ్డాడు.

"ఏయ్! ఆగండి. కాలేజీలో సీనియర్స్ మేము. మమ్మల్ని చూసి వెళ్ళిపోతున్నారేం కొంచెం కూడా మర్యాద లేకుండా" అన్నాడు రాజారామ్.

"వీళ్ళకి మర్యాద నేర్పు బాస్" ఎవరో అన్నారు.

"ఏం మర్యాద చెయ్యాలి మీకు?" ధైర్యంగా అడిగింది ప్రమీల.

"ముందు గుడ్‌మార్నింగ్ చెప్పండి"

"అలాగే. అంతా గుడ్‌మార్నింగ్ చెప్పండే..." అంది ప్రమీల.

"గుడ్‌మార్నింగ్ సార్!" అంతా కోరస్‌గా చెప్పారు.

"గుడ్... ఇప్పుడు మీరంతా మాకు గ్లాడ్ టూ మీట్ యూ అని షేక్ హేండ్స్ ఇవ్వాలి"

వాణిశ్రీ

అన్నాడు రాజారామ్.

జూనియర్స్ ఒకళ్ళ ముఖం మరొకళ్ళు చూసుకున్నారు.

“షేక్‌హేండ్ ఇవ్వండే...” అని ప్రమీల తనే ముందుకు వెళ్ళి, సీనియర్స్ అందరికీ షేక్ హేండ్ ఇచ్చి ‘గ్లాడ్ టూ మీట్ యూ’ అని చెప్పింది.

అంతా ప్రమీలను ఫాలో అయ్యారు.

“మీ పేర్లు చెప్పి పరిచయం చేసుకోండి” అన్నాడు.

అంతా పేర్లు చెప్పారు.

“రేపు ఏం చేయాలో తెలుసా?” అడిగాడు రాజారామ్. తెలియదన్నట్టు తలవూపారు.

“మీలో అందంగావున్న అమ్మాయి ఎవరు?” అన్నాడు.




అంతా ముఖాలు చూసుకున్నారు.

“ఓహో... మీరు చెప్పలేరు. ఎందుకంటే ఎవరికి వారు అద్దం ముందు కూర్చుని తామే మిస్ ఇండియా అనీ, మిస్ వరల్డ్ అనీ ఫీలవుతూవుంటారు కదూ?”

అతని కామెంట్‌కి మిత్రబృందం పకపక

నవ్వారు.

"ఒరేయ్! మీరు చెప్పండిరా! ఎవరికి ఎక్కువ ఓట్లు వస్తే వారిని అందగత్తెగా సెలెక్ట్ చేస్తాను"

అంతా సుజాత అందగత్తె అని చేతులెత్తారు.

సుజాత గుండెలో రాయిపడింది.

"మిస్ సుజాతా! యూ ఆర్ మిస్ కాలేజీ. రేపటికి"

అందరూ చప్పట్లు కొట్టారు.

"కంగ్రాట్స్"

సుజాత మాట్లాడలేదు. తనను ఏం చెయ్యమని అడుగుతాడో ఈ త్రాష్టుడు అని లోలోపల భయపడింది.

"రేపు మిస్ కాలేజీ సుజాత గార్లెండ్ తెచ్చి నా మెడలో వేస్తుంది" అన్నాడు రాజారామ్.

"ఏంటి బాస్? గాంధర్వ వివాహమా?" ఎవరో అడిగాడు.

"నో...నో... పూలదండ వేసినంత మాత్రాన పెళ్ళి చేసుకున్నట్టు కాదురా ఫూల్. మనం చూడడంలా... స్టేజీ మీద ఎందరికో ఎందరో పూలదండలు వేస్తుంటారు. చచ్చిన శవాలకు కూడా పూలదండలు వేస్తారు. అవన్నీ పెళ్ళిళ్ళా కావు. గౌరవించడం అన్నమాట. రేపు సుజాత నన్ను ఆ విధంగా గౌరవిస్తుందన్నమాట" అన్నాడు రాజారామ్.

సుజాత అయోమయంగా నిలబడింది. కళ్ళల్లో నుంచి నీళ్ళు కారుతున్నాయి.

"అలాగే బాస్" అని ప్రమీల సుజాత చెయ్యిపట్టుకుని నడిపించింది.

కొంతదూరం వెళ్ళాక "ఏమిటే మెడలో పూలదండ వెయ్యమంటాడూ?" ఆందోళనగా అడిగింది సుజాత.

"వెయ్యవే" అంది ప్రమీల నవ్వుతూ.

"నేను వేస్తాను సరే... దాన్ని ఎవడైనా ఫొటోతీసి, నేను వాడిని పెళ్ళిచేసుకున్నా...నని గొడవ చేస్తే?"

"చెయ్యనీ... ఎంత చదివినా చివరకు మనం పెళ్ళిచేసుకోక తప్పదుగా! ఒక పనైపోతుంది. మీ పేరెంట్స్‌కి కట్నాల గొడవ లేకుండా పోతుంది" నవ్వుతూ అంది ప్రమీల.

"ఛీ... నేను టెన్షన్‌తో చస్తూంటే నీకు నవ్వులాటగా వుందన్నమాట" అంది సుజాత.

"టెన్షన్ ఎందుకే? రేపొక గార్లెండ్ తెచ్చి వాడి మొహాన కొడితే పోతుంది"

"మొహాన కాదే... మెడలో వెయ్యమన్నాడు"

"సరే! మెడలోనే వేస్తే పోతుంది. ఆఫ్టాల్ ఫిఫ్టీ రుపీస్ వుంటుందేమో?"

"పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం అంటారు ఇందుకేనే..." ఉక్రోషంగా అంది సుజాత.

అంతా నవ్వారు.

★ ★ ★

మర్నాడు సుజాత, ప్రమీల వగైరాలంతా కాలేజీకి వెళ్ళేసరికి రాజారామ్ బ్యాచ్ వాళ్ళు దాదాపు పాతికమంది చేరారు.

జూనియర్ ఆడపిల్లల్ని చూసి హుషారుగా విజిల్స్ వేశారు.

"ఏయ్! గార్లెండ్ తెచ్చారా?" అడిగాడు రాజారామ్.

"తెచ్చాను బాస్" ధైర్యంగా ,చెప్పింది సుజాత.

"ఆలస్యం ఎందుకు? నా మెడలో వెయ్యి" అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

"జస్ట్ వెయిట్ బాస్. అంకుల్స్ వస్తానన్నారు" అంది ప్రమీల.

"అంకుల్సా? వాళ్ళెవరు?"

ప్రమీల గేటువైపు చూపించింది.

గేట్లో నుంచి పోలీస్ వ్యాన్ వస్తోంది.

సీనియర్స్ గప్‌చిప్‌గా నిలబడిపోయారు.

పోలీస్ వ్యాన్ వారి దగ్గరే ఆగింది. ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్ దిగారు.

"ఏం జరుగుతోంది ఇక్కడ?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"ర్యాగింగ్" చెప్పింది ప్రమీల.

"ఐ.సీ. సరే! కానివ్వండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సుజాతా! వెయ్యవే దండ" అంది ప్రమీల.

"దండ వెయ్యడం... అదేం ర్యాగింగ్?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"బాస్ వెయ్యమన్నాడు సార్! ర్యాగింగ్ అంటే సీనియర్స్ ఏం చేప్తే అది జూనియర్స్ చెయ్యడం అన్నమాట" చెప్పింది ప్రమీల.

"ఏమాత్రం మార్చకూడదా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కొంచెం మార్చవచ్చేమో?" అంది ప్రమీల.

"ఏం బాస్? కొంచెం మార్చవచ్చా?" రాజారామ్ వైపు చూసి అడిగాడు ఇన్‌స్పెక్టర్.

రాజారామ్ బిత్తరపోయి చూస్తున్నాడు. ఏం అంటే ఏం అంటాడో అని నోర్మూసుకున్నాడు. పోలీసుల వరకూ వెళ్ళారంటే వీళ్ళెవరో బాగా ఇన్‌ఫ్లూయన్స్ ఉన్న అమ్మాయిలని అర్థమైంది.

"బాస్ ఏం మాట్లాడ్డం లేదే?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సార్! సరదాగా ర్యాగింగ్ చేస్తున్నాం. సీరియస్‌గా తీసుకోకండి" నెమ్మదిగా అన్నాడు రాజారామ్.

"ఇదేం సరదారా రాస్కెల్? నీ చెల్లెల్ని ఎవడైనా మెడలో పూలదండ వెయ్యమంటే నువ్వు ఊరుకుంటావా? ఒక ఆడపిల్ల పరాయి మగాడి మెడలో పూలదండ వెయ్యడం అంటే దాని అర్థం నీకు తెలుసా?" కళ్ళెర్రజేసి అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ర్యాగింగ్ అంటే కొత్తగా వచ్చిన పిల్లలకి భయం పోగొట్టి, స్నేహంగా వుండడం. అంతే గాని శాడిస్ట్‌ల్లా ప్రవర్తించడంకాదు. నీలాంటి క్రూర మృగాల వంటి వాళ్ళ వల్ల సున్నితమైన మనస్తత్వం వున్న పిల్లలు ఆత్మహత్యలు చేసుకుంటున్నార్రా?" ఆవేశంగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సీనియర్స్ తలలు వంచుకుని నిలబడ్డారు.

"నీకు పూలదండతో సత్కారం కావాలా? చేస్తా... సత్కారం. అమ్మాయ్! ఏదీ దండ?" అన్నాడు.

సుజాత క్యారీ బ్యాగ్ ఇన్‌స్పెక్టర్‌కి అందించింది. అందులో నుంచి దండతీసి రాజారామ్ మెడలో వేసాడు.

"చప్పట్లు కొట్టండి."

అంతా చప్పట్లు కొట్టారు.

అది పాత చెప్పుల దండ.

సూర్యుడు తూర్పు దిక్కునే ఉదయిస్తాడు... పశ్చిమ దిక్కున అస్తమిస్తాడు. సూర్యుడి రాకపోకలు మారవు గాక మారవు. అత్తాకోడళ్ళలో ఉండే సఖ్యత కూడా అంతే నిజం.

"ఆమెగారు... అదే... మీ అమ్మగారు... ఆరోగ్యం బాగోలేదంటూ కూచున్న చోటు నుంచి కదలదు. అలాంటి స్థితిలో ఈ రోజు ఎవరిదో పెళ్ళంటూ పది కిలోమీటర్లు ఆటోలో పోయి వచ్చిందండీ... మామూలు వాళ్ళకే వొళ్ళు హూనం... దారిలో ఏదైనా జరిగితే.... మూలబడి మంచమెక్కితే, నా పని ఖతం. ఈవిడ పోనంత మాత్రాన పెళ్ళి ఆగిపోతుందా?... అదేంలేదుకదా... అటువంటప్పుడు ఈ రిస్క్ ఎందుకు? నేనిప్పుడే చెప్పేస్తున్నా... మీ అమ్మగారికేమైనా జరిగి కదల్లేని పరిస్థితొస్తే నాకు అంటగట్టొద్దు సుమా... మీరామెకి ఏం చెప్పుకుంటారో ఏమో... అయినా అందరిలాగా అత్తగారి పొత్తు పనికిరాదన్నానా? ముసలోళ్ళ ఆశ్రమంలో వొదిలెయ్యమంటున్నానా?... ఎక్కడికి పడితే అక్కడికి తిరిగొచ్చే ఓపిక ఇంట్లో ఉన్నంతసేపూ ఏమవుతుందో?" అంటూ ప్రశ్నలూ, సంశయాలూ ఏకధాటిగా వెళ్ళ బుచ్చిన భార్యవైపు మౌనంగా చూస్తుండిపోయాడు సూర్యం.

కొంతమంది గుండెల్లో వున్న కలుషితాన్ని సమయం చూస్కొని ఎదుటివాళ్ళ మీద కొద్దికొద్దిగా పులుముతుంటారు. ఆడవాళ్ళల్లో సఖ్యత, సర్దుబాటు ఉంటే ప్రతికుటుంబం కళకళలాడ్తుంది. సాటి స్త్రీ గురించి ఒక స్త్రీ ఇంత అల్పంగా ఆలోచించడంలో అర్థం, పరమార్థం ఏమిటి? మనసుని చక్కటి ఆలోచనల్తో నింపుకో గలిగిన స్త్రీ ఆరాధనీయమని అందరూ అనే మాటే... అందరికీ తెలిసిన సంగతే... అయినా ఎందుకలా నడుచుకోలేకపోతున్నారు? ఆ లోపం ఎక్కడుంది?

కొన్నికొన్ని మాటలు వినకూడదనుకొని, విన్నా మాట్లాడకూడదనుకొని 'చెవుడు' అనే ఆయుధాన్ని ధరించింది ఆ అత్త. ఎప్పటిలాగే ఆరోజు కూడా కోడలు కొడుకుతో చెప్తున్న మాటలు చెవిన పడ్తున్నా నిస్పృహగా తనలో తనే నవ్వుకొని సరిపెట్టుకొంది. తనకి శ్రమ అని తెలిసినా ఆటోలో పది కిలోమీటర్లు ఎందుకు వెళ్ళిందో కోడలికేం తెలుసు? తెలిసినా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుందా? ప్రయత్నించేదైతే తననే అడిగి ఉండొచ్చు కదా... నేరాన్ని వెతికి పట్టుకున్నట్టు భర్తకు చెప్పడం ఎందుకు? భర్త తనకు వంత పాడితే భార్య పొందే ఆనందం అంతాయింతా కాదు... కోడలి ముఖంలో అది కన్పడుతూనే వుంది.

తను ఎవరింట్లో పెళ్ళికయితే వెళ్ళొచ్చిందో వాళ్ళు... ఒకప్పుడు ఇల్లు కాలిపోయి దిక్కులేని వాళ్ళలా తమ ఇంటికొస్తే తనూ, తన భర్తా వాళ్ళను ఓదార్చి, ఆదుకున్నందుకు ఇంటిల్లిపాదీ ముఖాల్లో కృతజ్ఞతతో మెరిసిన మెరుపుని మర్చిపోలేకపోయింది. అదీగాక వాళ్ళంతా తను విధవరాలైనా తన ఆశీస్సులకోసం పాకులాడ్డం, పెళ్ళికి వచ్చినందుకు దేవతే దిగొచ్చినంతగా సంబరపడ్డం... పెళ్ళిలో తననెంతో గౌరవించడం... ఇంతకంటే జీవితానికేంకావాలి? ఎదుటివాళ్ళు మనల్ని మంచివాళ్ళు అని పొగిడేప్పుడు, అభిమానించేటప్పుడు... తెలీకుండానే సంతృప్తి కలుగుతుంది. అందుకే ఈరోజు పెళ్ళికి వెళ్లొచ్చింది తను.

ముసలివాళ్ళయినంతమాత్రాన గుర్తింపు ఉండకూడదా? కొడుకు, కోడలికీ తెలియకుం

దోర్నాదుల సుబ్బమ్మ

డా నిర్ణయాలు తీసుకోకూడదా? భర్త పోయాక పదిలక్షల రూపాయలు కొడుకు చేతికిచ్చింది. ఓ రెండు లక్షలు తన సేవింగ్స్‌లో ఉంచుకొంది. అయ్యో అన్పించే దీన స్థితిలో ఉన్నవారికి స్వ తంత్రంగా పది రూపాయలిస్తుంది. అలాంటివి కోడలి కంటపడినప్పుడల్లా ముఖం చిట్లించు కొంటుంది. చిలువలు పలువలు చేర్చి, భర్త వద్ద ప్రస్తావించినప్పుడల్లా ఆ కొడుకు వినీ విననట్లుంటాడు. "అమ్మ ఇష్టం వొచ్చినట్లు చేస్కోనివ్వు..." అని అప్పుడప్పుడూ భార్యకు సర్దిచెప్తుంటాడు.

ఆ మాటతో భార్య గయ్‌మంటూ "ఔను మరి! మీకు కోట్లకు కోట్లు ఆస్తిఉందికదా... పోతేపోనీ అనుకోవడానికి... మా బంధువుల్లో అందరికీ బంగళాలూ, కార్లు!... ఆ సౌకర్యాల న్నీ మీరు కూడా ఓ రోజుకి మనకూ సమకూరు స్తారని సరిపెట్టుకుంటూ వస్తున్నాను. అమ్మకు అడ్డు చెప్పే దమ్ము మీకు లేదాయె..."

ఎప్పుడూ ఈ చివరివాక్యం అత్తగారు వినే ట్టుగా మాట్లాడటంవల్లే... ఆ అత్తగారు 'చెవుడు' అనే దాన్ని అంటగట్టుకుంది. అడిగిందే అడ గడం, చెప్పిందే మళ్లీ చెప్పించుకోవడం... పెద్ద గా చెప్పమనటం అలవాటు చేసుకుంది.

తనకు వయసుతోపాటు చెవుడు వచ్చేసిం దని కొడుకు, కోడలూ నిర్ధారించుకున్నా తనను కున్న ప్రకారం జరిగిందని ఓ విధమైన తృప్తితో

"ఓ వంద రూపాయలు అప్పు ఇవ్వండి – ఒకటో తారీఖున ఇచ్చేస్తాను" భర్తని ముద్దుగా అడిగింది భార్య.

"ఎలా తీరుస్తావ్?" అడిగాడు భర్త.

"ఏం... ఒకటిన మీకు జీతం రాదా?" తిరిగి ప్రశ్నించింది భార్య.

వుండిపోయేది. లేనిలోపం అంటగట్టుకోవడం వల్ల ఇంట్లో ఏ పేచీలూ రాకుండా జరిగిపోతోం ది. అయినా కొన్ని మాటలు మనసుకు గుచ్చు కొని కళ్ళల్లోకి నీళ్లు తెప్పించేవి. తనకు తనే నచ్చచెప్పుకొని గుటకమింగి గుండెలోకి నెట్టు కునేది.

పిల్లల్ని వెంటబెట్టుకొని కోడలు పేరంటాని కెళ్ళింది. కొడుకు ఆఫీసు నుంచి రాగానే టీ ఇచ్చింది ఆమె. కొడుక్కి దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చుంది. తల్లీ కొడుకులు ఒకర్నొకరు చూ స్కుంటూ మౌనంగా ఉండిపోయారు. కొన్నిసా ర్లు మౌనం ఊరటనిస్తుంది.

'నీగురించి నీ కోడలు చెప్పేవన్నీ వింటున్నా నేగానీ... నీ మనసు నాకు తెల్సుకాబట్టి ఎప్ప టికీ అపార్థం చేసుకోనమ్మా... నీపై నేరం మో పినా ఖండించలేని అసహాయత నాది. నన్ను క్షమించమ్మా. సంసారం సఖ్యతగా ఉందనిపిం చుకోవాలనే నా ప్రయత్నం..." అంటూ తప్పు చేసి సంజాయిషీ యిచ్చేవానిలా కొడుకు చూ పుల్ని చూడలేక తల పక్కకు తిప్పుకొంది. తప్పు ని ఒప్పుకోవడం కూడా గొప్పదనమే.

నాకు తెల్సురా నీ మనసు... సంసారం గుట్టు రట్టు కాకుండా ఉన్నంత వరకే దాని గొప్పతనం. నా మూలంగా గొడవలు రాకూడ దనే చెవిటిమనిషిగా ఉండిపోయానని చెప్పబో యి ఆగిపోయింది. ఒకవేళ తనకు చెవుడు లేదని చెప్పేస్తే... కోడలు చేసే రాద్ధాంతమంతా అమ్మ మనసులోనే దాచుకుందన్న సంగతి తెలి స్తే... కొడుకు తన గురించి మరింత బాధపడ్తా డనిపించింది.

ఎదుటి వారు బాధపడే కారణాలు స్ఫురిం చినప్పుడు తప్పించడానికే ప్రయత్నిస్తారు చాలామంది. కొంతమంది మాత్రం ఓ పుల్ల




ఎక్కేసి, తగువుచూసి, సంతోషపడ్తారు. తను అలాంటిది కాదు గనుకే మౌనంగా ఉండిపోయింది.

ఎదురుగా చెట్టువైపు చూస్తున్న కొడుకుని చూసి తనే మొదలు పెట్టింది. "పండుటాకు ఎప్పటికైనా రాలిపోయేదే. రాలిపోతే కొమ్మకూ తేలికౌతుంది. ఏమైనా పదికాలాల పాటు ఆకులు, చివుర్లతో కొమ్మ పచ్చగా ఉంటుంది. సృష్టి ధర్మమే అంత...! పండుటాకు కూడా కొంత కాలం కొమ్మకు పచ్చదనాన్నిచ్చి రాలిపోయినా, మరలా ఆ చెట్టుకి ఎరువుగా మారాలని ఆశ పడ్తుంది. మనిషీ అంతే!" అంటున్న తల్లివైపు చూసాడు.

అమ్మ భావగర్భితంగా మాట్లాడ్తోందని తెలుస్తూనే ఉంది. అసలింతకూ అర్థం ఏమై ఉంటుంది? ఆలోచనలో పడ్డాడు ఓ నిమిషం సేపు. తళుక్కున మెరిసింది అమ్మ మాటల్లో అర్థం.

"కోడలూ ఓనాటికి అత్తే అవుతుందమ్మా"

ఉపశమనంకోసం అన్నాడు. ఉన్న సంగతి అదేకదా అన్నట్టు చూసాడు. కసి, బాధ, నిస్సహాయత... మూడూ ముడిపడివున్న కొడుకు ముఖాన్ని చూసేసరికి తల్లిపేగు కళపెళలాడింది.

"నా సంతృప్తికోసం నువ్వలా మాటాడొద్దు నాన్నా. ఏ వేళ ప్రభావం ఎలా ఉంటుందో... నా పరిస్థితి నా కోడలికి రాకుండా ఉండాలనే ఆశపడ్తున్నాను. తన బాధ ఇతరులు కూడా పడడం చూసి కొంతమంది సంతోషపడతారు. నేనలాంటిదాన్నా...?"

"అమ్మా...!" ఆ పిలుపు అంతరంగంలో నలుసంత కల్మషానిక్కూడా చోటివ్వనని మాట ఇచ్చినట్లుగా ఉంది.

అమ్మ నవ్వింది... ఆ నవ్వు మాతృత్వం పక్షం నిలిచి, వక్షస్థలాన్ని చీల్చి కొడుకు మీదున్న మమకారాన్ని చూపెట్తోంది. ●

# అప్లోళ్లే ఆప్తులయిన వేళ



ఉదయం భార్య ఇచ్చిన కాఫీ తాగి, పెరటి దొడ్లోకి దారితీసాడు ఏకాంబరం. చెట్ల పాదులన్నీ సరిచేసి, మధ్యమధ్యలో గడ్డి, పిచ్చి మొక్కల్ని పీకేస్తున్నాడు. చిక్కుడు, కాకర పందిళ్లు సరిచేసి, తీగలు పాకిస్తున్నాడు. విశాలాక్షి ఇంట్లో పనంతా పూర్తిచేసి, స్నానంచేసి, పూజ కూడా ముగించింది. వంట మొదలుపెట్టాలంటే ముందుగా కూరగాయలు వెదుక్కోవాలి. ఉన్నది ఇద్దరు మనుషులు. ఎంతలోకి చేస్తాలే... అనుకుంటూ భర్త జాడ ఎక్కడా కనిపించకపోయేసరికి పెరట్లోకి వచ్చింది.

"ఏం చేస్తున్నారండీ ఇంకా ఇక్కడ? వంట మొదలుపెడదామంటే కూరలు లేవు. బజారు కెళ్లి ఏమైనా తీసుకురండి" అంది.

"ఇందాకటి నుంచి పందిరంతా వెదికితే ఆరు దొండకాయలు దొరికాయి. మూడు కాకరకాయలు కోసాను. అదిగో ఆ గోంగూర మొక్కలకి పది ఆకులు వస్తాయి. వాటిని మాత్రం రేపటి కోసం ఉంచాను. పప్పులోకి సరిపోతాయి. ఈ రోజుకి కాకరకాయ పులుసుపెట్టి వండు. దొండకాయ కూరచెయ్యి. వేపుడు మాత్రం చేయకు. నూనెలు పోసి ఎక్కువ వేపుళ్లు చేసుకుని తింటే బి.పి. వచ్చి డాక్టర్ దగ్గరకి పరుగెత్తాలి. ఫీజులు, మందులంటూ అదో డబ్బు దండగ. నేను చెప్పినట్టు చేసావంటే ఇద్దరి

తాటికోల పద్మావతి

ఆరోగ్యాలూ బాగుంటాయి" అంటూ ఏకాంబరం ఆరోగ్యం గురించి ఉపన్యాసం ఇచ్చి, ఆ మూడు కాకరకాయలు, ఆరు దొండకాయలూ భార్య చేతిలో పెట్టాడు.

"ఇదెక్కడి విడ్డూరమండీ! ఇపుడు మనకి బి.పి.లు, షుగర్లూ లేవు కదా. వస్తాయని ముందే ఊహించుకుని తిండి కూడా సరిగా తినకుండా మానేయమంటారా ఏమిటి? రానురాను మీకు మరీ పిసినారితనం ఎక్కువైపోతోంది."

"ఇలా చేయబట్టే ఇద్దరాడపిల్లలకూ పెళ్లిళ్లు చేసి అత్తవారింటికి పంపించాం. దుబారా ఖర్చులకు పోతే పెళ్లికాని ఆడపిల్లల్ని గుండెల మీద కుంపటిలా కూర్చోబెట్టుకుని నిత్యం ఏడ్చే



వాళ్ళం. చేసింది బడిపంతులు ఉద్యోగం. వచ్చే పెన్షన్ డబ్బులతోనే ఇల్లు గడుపుకోవాలి.”

“ఆ చేసారు లెండి... దేశంలో మీరొక్కరే ఆడపిల్లల్ని కని పెళ్లి చేసినట్టు మాట్లాడతారు. మొన్న వినాయక చవితికి పెద్దమ్మాయిని, అల్లుడినీ పిలిచారు. పత్రి కొనకుండా ఊర్లో చెట్లన్నీ ఎక్కి కొమ్మలన్నీ విరిచి పత్రి పోగుచేసారు. పిండి వంటలన్నా చేయించారా అంటే అదీ లేదు. నూనె ఖర్చు లేకుండా కుడుములు, ఉండ్రాళ్లతో సరిపెట్టారు. అదేమంటే వినాయకుడికి అవే ఇష్టం, మనకోసం కాదు దేవుడికోసం చేయాలన్నారు. ఇక బట్టల విషయానికొస్తే ఇది మగవాళ్ల పండుగ. అందులో చవితి పండుగ. కొత్త బట్టలు కొనగూడదంటూ అల్లుడికి ఒక్కడికే ఇంట్లో ఉన్న పంచె, తుండూ పెట్టి, అమ్మాయిని ఉత్తచేతులతో పంపించారు. రేపు వచ్చే దీపావళికి ఇలా చేస్తే నేను మాత్రం ఊరుకొనేదిలేదు. ఇద్దరు కూతుళ్లని, ఇద్దరు అల్లుళ్లనీ పిలవాల్సిందే. బట్టలతో పాటు టపాకాయల ఖర్చు కూడా ఉంటుంది. మీకు ఇప్పటి నుంచీ చెబితేగానీ చెవికెక్కదు. వాళ్లున్న రెండురోజులైనా మీ పిసినారితనం మానుకొని జాగ్రత్తగా ఉండ” మంటూ భర్తని నాలుగు చివాట్లుపెట్టి, ఆ దొండకాయలు, కాకరకాయలూ తీసుకుని లోపలికి వెళ్లింది విశాలాక్షి.

భార్య వెళ్లినవైపు పళ్లుకొరుకుతూ చూసాడు ఏకాంబరం. దీపావళికి ఇద్దరు కూతుళ్లు, అల్లుళ్లనీ పిలవాలా? పిల్లలకి టపాకాయలు కొనాలా? వాళ్లు పిల్లలు కాదు... చిచ్చుబుడ్లు. వచ్చారంటే ఇల్లుపీకి పందిరేస్తారు. బంతాట ఆడి తలుపులు, అద్దాలూ పగలగొడతారు. దొడ్డంతా పరుగెత్తి మొక్కలన్నీ పీకి పాడుచేస్తారు. పొద్దున్న ఒక్కొక్కరికీ గ్లాసుడు పాలు కావాలని పేచీలు. పెద్దవాళ్లకి కాఫీలు, టీలు, టిఫిన్‌లు. భార్యచేత అవి చేయించమంటూ, ఇవి చేయించమంటూ ఆర్డర్లు జారీ. ఒకరికి బొబ్బట్లు అంటే ఇష్టం అంటారు. మరొకరికి కజ్జికాయలంటే ఇష్టం అంటారు. ఆ ఖర్చులు భరించడం నా వల్లకాదు. ఈసారి దీపావళి పండక్కి ఇంట్లో ఉండకుండా ఎక్కడికైనా వెళ్లిపోవాలి. ముందుగానే పథకం గురించి ఆలోచించి ఒక ప్లాన్ వేస్తున్నాడు ఏకాంబరం.

పండుగ పదిరోజులుండనగా ఉత్తరాలు వ్రాయమని పోరుపెట్టింది విశాలాక్షి. భార్య పోరు పడలేక పండక్కి రమ్మని ఉత్తరాలు వ్రాసాడు. అడ్రస్‌లు మాత్రం వ్రాయకుండానే పోస్ట్ చేసాడు. దీపావళి ఖర్చు ఎలాగైనా తప్పించుకోవాలని చూస్తున్నాడు ఏకాంబరం. పండుగ రెండు రోజులుండనగా ఊడిపడతారేమోనని అనుమానం వచ్చింది. ఇంటికి తాళంపెట్టి ఎటైనా వెళ్తే ఎలా ఉంటుందని ఆలోచించాడు. బంధువుల ఇంటికి వెళ్తే ఛార్జీలకు డబ్బు దండగ. ఉత్తరాల మీద అడ్రస్‌లు వ్రాయలేదు కదా! ఎలా వస్తారులే అనుకున్నాడు. ఉత్తరాలు వ్రాసి పడేసిన రెండురోజులకే చిన్న అల్లుడు ఏదో పనిమీద ఆ ఊరు వచ్చి, అత్తమామల్ని చూసిపోదామని ఊర్లో దిగాడు. పొద్దున్నే ఊడిపడుతున్న అల్లుణ్ణి అంతదూరాన్నుంచే చూసి, గబగబా లోపలికి వెళ్లిపోయాడు ఏకాంబరం. మంచంమీద పడుకుని దుప్పటి ముసుగుపెట్టి మూలుగుతున్నాడు. విశాలాక్షి లోపల ఏదో పనిమీద ఉంది. అల్లుడి మాట వినిపించగానే బయటికి తొంగిచూసింది.

“ఎంతసేపయిందయ్యా వచ్చి? అమ్మాయి కులాసానా... ఉండండి కాఫీ తెస్తా”నంటూ లోపలికి వెళ్లింది. కుర్చీలో కూర్చున్నాడు రాజా




రావు. మంచంలో నుంచి మూలుగులు విన బడుతున్నాయి. ఎవరబ్బా అక్కడ పడుకొన్న ది... మామగారే అయిఉండవచ్చనుకున్నాడు. అత్తగారిచ్చిన కాఫీ గ్లాసు అందుకుంటూ మామగార్ని అడిగేసరికి అపుడు గుర్తుకొచ్చింది విశాలాక్షికి. మంచం దగ్గరికి వెళ్లి చూస్తే ఇంకే ముంది? ముసుగుతన్ని పడుకున్నాడు ఏకాం బరం. "ఇప్పటిదాకా బాగానే ఉన్నారు కదండీ. అంతలోనే ఏం మాయదారి రోగం ముంచు కొచ్చింది?"

"ఇంకేముంది... ఒళ్లు కాలిపోతోంది. నాకు జ్వరం వచ్చింది. కాళ్లూ చేతులూ స్వాధీనంలో లేవు. ఎక్కడివక్కడ పట్టుకుపోయాయి. నాకు చికెన్‌గున్యా వచ్చింది. అమ్మో! నేను లేవలే" నంటూ శోకాలు పెట్టడం ప్రారంభించాడు.

విశాలాక్షి భర్తను తాకిచూసింది. శరీరం చల్లగానే ఉంది. ఆమెకి అర్థమైపోయింది. "సాయంత్రం డాక్టర్ దగ్గరికి తీసుకెళ్తాలెండి. ఇప్పటికి కళ్లుమూసుకుని పడుకోండి" అంది.

"దీపావళికి రమ్మని ఉత్తరాలు వ్రాసాము. అమ్మాయిని తీసుకుని నాలుగు రోజులు ముం దే రావాలి" అంది విశాలాక్షి.

బిత్తరపోయాడు రాజారావు. "ఉత్తరాలా? ఎప్పుడు వ్రాసారు? మాకు అందనేలేదు."

"అందకపోవడం ఏమిటండీ. నేనే దగ్గ రుండి స్వయంగా వ్రాయించాను. పోస్టల్ డిపా ర్ట్‌మెంట్‌వారి లోపం వల్ల అందకపోవచ్చు. పోనీ లెండి ఇపుడు చెబుతున్నాను పండక్కి తప్పకుం డా రావా"లంది.

"మామయ్యగారు ఒకపక్క చికెన్‌గున్యాతో బాధపడుతూంటే పండుగ ఏం చేసుకుంటాం లెండి. మరోసారి వస్తాంలే" అన్నాడు రాజా రావు.

అల్లుడు అంటున్న మాటలు వింటూ దుప్ప టి ముసుగులోనే నవ్వుకుంటున్నాడు ఏకాం

బరం. వచ్చిన పని పూర్తిచేసుకుని అటునుంచి అటే వెళ్లిపోతానంటూ బయలుదేరాడు రాజారావు. గేటుదాకా సాగనంపడానికి వచ్చింది విశాలాక్షి. భర్తకి వినిపించకుండా ఏదో చిన్నగా చెబుతుంటే రాజారావు అలాగేనంటూ తలఊపాడు. అల్లుడు వెళ్లిపోగానే తలుపులు వేసి లోపలికి వచ్చింది విశాలాక్షి.

దుప్పటి ముసుగుతీసి "ఇక లేవండి. అల్లుడు వెళ్లిపోయాడు" అంది. ఏకాంబరం లేచి కూర్చున్నాడు. "పదండి డాక్టర్ దగ్గరికి తీసుకెళ్తాను" అంది.

"ఎందుకు? అదొక డబ్బు దండగ. అదేపోతుందిలే" అన్నాడు.

"నిజంగా ఉంటేనే కదా పోవడానికి. ఉత్తరాలు వ్రాయమంటే వ్రాసారు. అవి చేరలేదంటే అర్థమేమిటి? వాటిమీద అడ్రస్‌లు వ్రాసి ఉండరు. అందుకే అవి అందలేదు. అల్లుడుగారు ఇంటికి రాబట్టి అసలు నిజం తెలిసింది. వాళ్లేమన్నా పరాయివాళ్లనుకున్నారా? డబ్బు కోసం మరీ ఇంత కక్కుర్తిపడుతున్నారు?"

"ఆ డబ్బేనే అన్నిటికీ ముఖ్యం. డబ్బు లేనివాడు దేనికీ కొరగాడు. దీపావళికి ఖర్చు తప్పింది చూసావా" అన్నాడు. ఆ వెయ్యిరూపాయలు వడ్డీకిస్తే నెలకి నాలుగు వందలొస్తాయన్నాడు.

"ఎలా తప్పుతుందిలే" అనుకుంది మనసులో. భర్త మనసు తెలిసిన విశాలాక్షి అంతకు సరిపడా ఆలోచనలు చేసి, సమయానికి అన్నీ జరిగేటట్లు చూస్తుంది. ఇద్దరిలో ఒక్కరైనా సజావుగా ఉంటే కొంతలో కొంత మేలు.

ఎలాగూ తనకి వంట్లో బాగోలేదని అల్లుడికి తెలిసింది కదా. పండక్కి రారులే అను

ఏడుస్తూ పోలీస్ స్టేషన్‌కి వచ్చాడు ఎనిమిదేళ్ల అభిషేక్. "ఏం బాబూ! తప్పిపోయావా?" అడిగాడు గుమ్మంలో ఉన్న కానిస్టేబుల్.

"కాదంకుల్! మా అమ్మా నాన్నా బజార్లో ఎక్కడో తప్పిపోయారు" మళ్లీ ఏడుపు లంకించుకున్నాడు అభిషేక్.

కొన్నాడు ఏకాంబరం. తెల్లవారితే నరక చతుర్దశి అనగా ముందురోజు ఉదయమే దిగారు ఇద్దరల్లుళ్లు, కూతుళ్లు, పిల్లలు. అంతా ఒకే ఊరిలో ఉండటంవల్ల ముందే కూడబలుక్కుని ప్రయాణమయ్యారు. "ఈసారి మీ నాన్నచేత నాకు సెల్‌ఫోన్ కొనిపెట్టించు. ఏదో చవకరకం బట్టలతో సరిపుచ్చాలని చూస్తే ఊరుకునేది లేదం"టూ ముందే చెప్పిఉంచాడు పెద్ద అల్లుడు.

"మరి నా సంగతేంటి? కొత్తగా పెళ్లయిన వాళ్లం. కనీసం కలర్ టీవీ అయినా ఇస్తాడా మీ నాన్న. ఎలా చెబుతావో ఏమో నీ ఇష్టం" అన్నాడు రాజారావు.

ఏకాంబరానికి వీళ్లందరినీ చూసేసరికి గుండెల్లో రాయిపడింది. "తాతయ్యా! మాకు టపాకాయలు తెచ్చావా" అంటూ పిల్లలిద్దరూ చుట్టుముట్టారు.

"సాయంత్రం అలా బజారుకి తీసుకెళ్లి కొనిపెడతారులే. గొడవ చేయకండి" అంది విశాలాక్షి.

"ఆ... ఆ... అలాగే" అన్నాడు ఏకాంబరం. కాఫీలు, టిఫిన్‌లు చేసి స్నానాలు ముగించుకున్నారు. ఈలోగా కూతుళ్ల సాయంతో వంట ముగించింది విశాలాక్షి.

ఏకాంబరం మళ్లీ చికన్‌గున్యా వంకతో

ముసుగుతన్ని పడుకున్నాడు. తండ్రితో ఎలా చెప్పాలా అంటూ కూతుళ్లిద్దరూ ఎదురుచూస్తు న్నారు.

సాయంత్రం ఐదుగంటల వేళ ఒక రైతు చేతిసంచీ పట్టుకుని వచ్చాడు ఆ ఇంటికి. "ఏకాంబరంగారు ఉన్నారా?" అనగానే ఆయ నతో పనేంటో చెప్పమన్నాడు రాజారావు.

"ఆయనకివ్వాల్సిన డబ్బు ఇచ్చిపోదామని వచ్చానండీ. ఒకసారి పిలుస్తారా?"

"ఏకాంబరంగారికి కాళ్లు స్వాధీనంలో లేవు. ఆయన మంచంలో ఉన్నారు. ఆ డబ్బేదో మాకే ఇవ్వండి. ఏకాంబరంగారు మా మామగారే" నని చెప్పారు అల్లుళ్లు.

ఓరి వీడి దుంపతెగ. ఇప్పుడే రావాలా? డబ్బు చూసారంటే ఇంకేమైనా ఉందా? "ఎవ రదీ" అంటూ లేచివచ్చాడు ఏకాంబరం.

"అయ్యా! నేను పొలం అమ్మేసానండీ. మీకి వ్వాల్సిన పదివేలు వడ్డీతో సహా లెక్కచూసి తెచ్చాను. ఇదిగో మీ డబ్బు తీసుకుని నా పత్రం నాకిచ్చారంటే వెళ్లిపోతాను."

గుండెల్లో రాయిపడింది ఏకాంబరానికి. నోటు తేవడానికి లోపలికి వెళ్లాడు. డబ్బు లెక్క పెట్టమంటూ చేతికిచ్చాడు ఆ రైతు. చిన్నల్లుడు తీసుకుని నోట్లకట్టలు లెక్కిస్తున్నాడు. ఏకాం బరం నోటు తెచ్చిచ్చాడు. "డబ్బు సరిపోయిం ది. చూసారా... మామగార్కి మనం వస్తామని ముందే తెలుసు. నీకు సెల్‌ఫోన్, నాకు కలర్ టీవీ కొంటానికి ముందే డబ్బు రెడీ చేసు కున్నారు. కూతుళ్లమీద ఆయనకి అంత ప్రేమ. పిల్లలూ మీకు టపాకాయలు రెడీ. రేపంతా కాల్చుకోవచ్చు" అన్నాడు రాజారావు.

అల్లుడి మాటలు ఆటంబాంబులా పేలాయి. ఎగిరి అంత దూరాన పడ్డట్టయింది ఏకాంబరం పని. విశాలాక్షి వచ్చి ఆ నోట్ల కట్టలు తీసుకుంది. పెద్దల్లుడి చేతిలో ఐదువేలు, చిన్నల్లుడి చేతిలో ఐదువేలు పెట్టి, "మీకు కావలసినవి కొనుక్కోండి. పిల్లలకి బట్టలు, టపాకాయలు అన్నీ మీరే చూసి తెచ్చుకోండి. సాయంత్రం అయింది కదా బజారు వెళ్లిరండి" అంది.

ఏకాంబరానికి నోట మాట రాలేదు. చేసేదేమీ లేక ఇచ్చిన డబ్బు ఎటూ తిరిగిరాదని తెలుసుకుని, మనసులో బాధ కనిపించకుండా... "సరే మీ ఇష్టం బాబూ... మీ అత్తగారు చెప్పినట్టే చేయండి" అన్నాడు.

మన రొట్టె విరిగి నేతిలో పడిందన్నాడు రాజారావు. కాదు తేనెలోనే పడిందన్నాడు తోడల్లుడు. ఏకాంబరం తప్ప అందరి ముఖాలూ సంతోషంతో దీపావళి చిచ్చుబుడ్డిలా వెలిగిపోతున్నాయి.

నరక చతుర్దశి రోజు చీకటితోనే లేచారందరూ. టపాకాయల శబ్దాలతో ఇల్లంతా మోత మోగిపోయింది. ఆ చప్పుళ్లు వినలేక చెవులు మూసుకున్నాడు ఏకాంబరం. పిల్లలిద్దరి గోల, అరుపులతో దద్దరిల్లిపోయిందా ఇల్లు. విశాలాక్షి పిండివంటలతో బిజీగా ఉంది. అల్లుళ్లిద్దరి ఆనందానికి అవధులు లేవు. తలంట్లు, కొత్త బట్టలు, పిండివంటలతో భోజనాలు సుష్టుగా చేసారు. ఆ రోజు గడిచిపోయింది. మర్నాడు దీపావళి. సాయంత్రం ఇల్లంతా ప్రమిదలు వెలిగించారు. గోడలమీద, గేట్లమీదా పెట్టారు. టపాకాయల బుట్ట ముందర పెట్టుకుని చిచ్చుబుడ్లు, ఆటంబాంబులు అల్లుళ్లు, పిల్లలూ అంతా కలిసి పేల్చారు. టపాకాయల కోసం అన్ని రూపాయలు ఖర్చుపెట్టి వాటిని కాల్చుతూంటే ఏకాంబరం నోట్ల కట్టల్ని కాల్చినంతగా బాధపడిపోయాడు. రాత్రి పదకొండు గంటలదాకా పేల్చుతూనే ఉన్నారు. వాళ్లతో చేరి విశాలాక్షి కూడా చిన్నపిల్లలా టపాకాయలు కాల్చింది. "మీరూ రండి... ఇవిగో ఈ మతాబులు వెలిగించండి. పిల్లలు సరదాగా కాలుస్తుంటే చూసి ఆనందించాలి గానీ వంటరిగా ఇంట్లో పడుకుని ఏం చేస్తా"రంటూ విశాలాక్షి నాలుగు చివాట్లు పెట్టింది.

"ఇదంతా నువ్వు చేసిన నిర్వాకం. వాళ్లని పండక్కి పిలవడం, వచ్చిన పదివేలూ వాళ్లకిచ్చి ఖర్చుపెట్టుకోమనడం... ఎన్నాళ్లు కూడబెడితే పదివేలు పోగవుతాయి?"

"సంపాదించింది ఖర్చు పెట్టడానికే. మన పిల్లల కోసం మనం ఖర్చుపెట్టుకున్నాం. ఈ సరదాలు మళ్లీ వస్తాయా? మన పిల్లలకి పెట్టకపోతే పరాయివాళ్లకి పెడతామా? మీ చేతిలో పడితే ఆ డబ్బు వాళ్లకివ్వరు. అందుకని నేనే తీసుకుని ఇచ్చాను. మనం పెద్దవాళ్లమయ్యాం. మనకి ఎటూ ఆ సరదాలు రావు. పోయేటపుడు ఏదీ పట్టుకుపోలేం. ఒకరికయినా పెట్టే గుణం ఉండాలి" అంది.

"నీకేం... నువ్వు ఎన్నయినా చెబుతావులే. నీకేం తెలుస్తుంది డబ్బు విలువ? అది నా కష్టార్జితం." అల్లుళ్లు వింటారని అంతటితో ఆపేసింది విశాలాక్షి.

★ ★ ★

తెల్లవారి ఏడుగంటలు దాటినా ఏకాంబరం లేవలేదు. జ్వరంతో మూలుగుతున్నాడు. ప్రయాణానికి అంతా బయలుదేరారు. "ఏమండీ... నిజంగా జ్వరమేనా!" అంటూ చూసింది విశాలాక్షి. వళ్లు జ్వరంతో కాలిపోతోంది.




రాజారావు వెంటనే ఆటో పిలిచాడు. ఏకాంబరాన్ని హాస్పటల్‌కి తీసుకెళ్లాడు. డాక్టర్ పరీక్ష చేసి చికన్‌గున్యా అని చెప్పాడు. ఫరవాలేదు తగ్గిపోతుందంటూ మందులు వ్రాసి ఇచ్చాడు. నేను తెస్తానంటే నేను తెస్తానని అల్లుళ్ళిద్దరూ పోటీలుపడి మందులు కొన్నారు. హార్లిక్స్‌లు, బత్తాయి పళ్లు తెచ్చి ఏకాంబరాన్ని ఎంతో శ్రద్ధగా చూసుకున్నారు. డాక్టర్ ఫీజు చెల్లించేసి ఇంటికి తీసుకొచ్చారు. "మామగారూ! మీరు బాగా రెస్ట్ తీసుకోండి. వేళకి మందులు వేసుకోండి. వారం రోజుల్లో పూర్తిగా నయమైపోతుంది. మీరేం దిగులుపడొద్దు. కావాలంటే మీ అమ్మాయిల్ని ఉంచి వెళతాం" అన్నారు.

వాళ్లు చూపిస్తున్న ప్రేమాభిమానాలకు ఏకాంబరం కళ్లు చెమర్చాయి. హాస్పటల్ ఖర్చంతా వాళ్లే భరించారు. కూతుళ్లు సేవలు చేయడానికి సిద్ధపడ్డారు. తను వాళ్లని పండక్కి పిలిస్తే డబ్బు ఖర్చవుతుందని ఆలోచించాడు. వాళ్లున్న ఈ రెండు రోజులూ సరదాగా గడిచిపోయాయి. నిజంగా ఇలాంటి అల్లుళ్లుండడం అదృష్టం అనుకున్నాడు.

పదిరోజుల్లో ఏకాంబరానికి జ్వరం తగ్గిపోయింది. కొద్దిగా కాళ్లు, చేతులూ నొప్పిగా ఉన్నాయంటున్నాడు. కూతుళ్లు నాలుగురోజులుండి వెళ్లిపోయారు. విశాలాక్షి భర్తని అంటిపెట్టుకుని వేళకు అన్నీ అమరుస్తోంది. "చూసారా! మీ పిసినారి బుద్ధికి మీ అల్లుళ్లే పరాయి వాళ్లలా అన్పించారు. కానీ కష్టపు వేళలో ఆ అల్లుళ్ళే ఆప్తుల్లా మిమ్మల్ని ఆదుకున్నారు" అంది.

"నిజమేనే! అల్లుళ్లు నా కళ్ళు తెరిపించారు. ఇంకెప్పుడూ ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాల్తో నా అల్లుళ్ళను దూరం చేసుకోవాలనుకోను బుద్ధొచ్చింది." అంటూ చెంపలేసుకున్నాడు.

"అదీ... అలారండి దారికి" అంది నవ్వుతూ విశాలాక్షి. ఆమెనవ్వుతో ఏకాంబరమూ శృతి కలిపాడు. ఆ ఇంట్లో దీపావళి మతాబుల వెలుగులు అప్పుడు కన్పించాయి. ●

# పరుగో పరుగు



చాముండేశ్వరికి చాలా ఆనందంగా ఉంది. యిలా పెళ్లిళ్లకు రాక చాలా నెలలు అవుతోంది. అదీగాక ఎప్పుడూ బిజీగా ఉండే భర్త సదా శివానికి సెలవు గ్రాంట్‌కావడం, మరునాడు ఆదివారం కావడం మరింత ఆనందంగా ఉంది.

"చిన్నమ్మా... బాగున్నరా?"

'చి...న్న...మ్మా... ఈవిడెవరు?'

"నన్ను గుర్తు పట్టలేదా చిన్నమ్మా... నేను సావిత్రిని. సదాశివం చిన్నాయన మేనవదిన బిడ్డను... అంతా బాగుండ్రా"

"ఆ... బాగున్నాం"

"పిల్లలేం చదువుతుండ్రు?"

"బాబు ఇంజనీరింగ్, పాప ఇంటర్ చదువు తున్నారు"

"పిల్లలు వచ్చిండ్రా"

"రాలేదు... వారం రోజులు సెలవులు వచ్చాయని అమ్మమ్మగారింటికి వెళ్లారు"

"అవునా?... అయినా నాకు మీతో పని... మీ పిల్లలతో గాదులెండి" డబ్బాలో రాళ్ళు పోసి ఆడించినట్లు నవ్వింది.

"తానెప్పుడూ ఈవిడను చూడలేదు. పైగా తనకంటే నాలుగైదు సంవత్సరాలు పెద్దగా కన్పి స్తున్న ఈవిడ తనను 'చిన్నమ్మా' అనడం ఏమిటి?"

"చిన్నమ్మా... డైరెక్ట్‌గా విషయంలోకి వస్తు న్నాను"

అర్థంగానట్లు చూసింది చాముండేశ్వరి...

'క్రీమ్‌వాష్' అని నేను ఒక ప్రోడక్ట్ ఏజెన్సీ తీసుకున్నాను... అందులో యింటికి అవసరం పడే ప్రొడ క్ట్స్ ఉంటాయి. ఐమీన్... కాఫీ పౌడర్, టీ పౌడర్... కాటన్ బండిల్స్... షేవింగ్‌కిట్... వాషింగ్ గ్రాన్యూల్స్... యిలా ఇంకా చాలా ఉన్నాయి. ఇవి ఎంత మంచివంటే..." అంటూ కళ్లు తిప్పుతూ చేతులు ఊపుతూ చెబుతూ ఎప్పటికో 'కామా' పెట్టింది.

అలాగే కళ్లార్పకుండా చూసింది చాముం డేశ్వరి...

"మీకెంత లాభమో అర్థమైందిగా... యిది మీవరకే గాదు... తరతరాలకు లాభదాయ కంగా ఉంటుంది... మీరెలాగైనా ఏజెన్సీ తీసు కోవాలి... మీకు యిప్పుడయ్యే ఎమౌంట్ 'ఓన్లీ సిక్స్ థౌజండ్' అంటూ మరో రికార్డువేసి, "మిమ్మల్ని ఎంతమాత్రం వదిలేది లేదు" అంటూ ఫుల్‌స్టాప్ పెట్టింది.

చాముండేశ్వరి తెగ ఇబ్బంది పడిపోయి, దూరంగా కన్పిస్తున్న సదాశివాన్ని చూపిం చింది.

"చిన్నాయనా" అంటూ ఎగురుకుంటూ వెళ్లింది సావిత్రి... 'ఇప్పుడాయన ఏం చేస్తారో చూడాలి'... నిన్నటి రోజు గుర్తుకొస్తూంటే పెళ్లి కొచ్చిన తాలూకు ఆనందాన్ని మర్చిపోయింది చాముండేశ్వరి...

* * *

"ఏమిటి? యివన్నీ ఏమిటి? వందలకు వం దలు తగలేసి వీటన్నిటితో షెల్ఫ్‌లను నింపటం గాదు... యిరుగుపొరుగు వాళ్లయితే ఏంటట? వాళ్లతో ఎప్పుడో ఏదో అవసరం పడుతుం దేమో అని యివన్నీ కొనాలా? ఎందుకింత మొహమాటం?"

కోటమర్తి రాధాహిమబిందు

"అబ్బ... మొహమాటంగాదు... జిడ్డులా పట్టుకుంటే ఏం చేయను?"

"జిడ్డులా పట్టుకుంటే వదిలించుకుని పరిగెత్తుకురావాలి. ఈ డబ్బుతో మనకు పదిహేను రోజులకు వెచ్చాలు వస్తాయి. మనం మధ్య తరగతి కుటుంబీకులం అన్నది మర్చిపోయి స్టయిల్‌గా తీసుకొచ్చావా?" రంకెలేసాడు సదాశివం.

"అబ్బబ్బ... చిన్నగా మాట్లాడండి... వాళ్ళకు వినబడుతుంది. యింకా నయం యింతటితో వచ్చాను... 'క్రీమ్ వే ప్రోడక్టట" ఏజెన్సీ తీసుకోమని ప్రాణం తీసింది. వాటిని అమ్మాలట..."

"తట్టల్లో... బుట్టల్లో పెట్టుకుని కూరగాయలో... అన్నట్లుగా అమ్మాలటనా?"

"అహ... కాదు. తోపుడు బండి మీదట... వినరేం చెబుతూంటే... ఎంతసేపూ మీరే మాట్లాడతారా? నా మాట విన్పించుకోరా? ఆవిడేదో చాట భారతం చెప్పింది. నిజానికి నాకు అంత బాగా అర్థం కాలేదు కూడా. ఈ గోల ఎందుకులే అని ఓ ఐదువందల్లో యిదిగోయివి తీసుకొచ్చాను".

"వీటిని ఎవరికైనా అంటగట్టు" అన్నాడు సదాశివం.

"నేనా?... నేనెవరికి ఇస్తాను? అంత వాక్చాతుర్యం... తెలివికలతనం నాలో లేవులెండి. నేనలా బజారు పట్టుకుని తిరగలేను... యింటింటికీ వెళ్లి అడగనూలేను... అయినా మీకో విషయం చెప్పనా? పేరుకే ఏజెన్సీ ఆవిడ పేర్న తీసుకున్నది. సేల్స్ అంతా భజగోవిందం గారేనట" నవ్వుకుంటూ జడ తిప్పుకుంటూ వెళ్లి పోతున్న భార్యను కసిగా చూసాడు సదాశివం.

బెడ్ మీద పరిచిన 'క్రీమ్ వే ప్రోడక్ట్స్' అతన్ని చూసి కన్నుగీటాయి.

* * *




ప్రముఖ కవి ఎం.ఆర్.వి. సత్యనారాయణమూర్తికి రంజని-కుందుర్తి ఉత్తమ కవితా పురస్కారాన్ని అందజేస్తున్న ప్రముఖ కవి శీలా వీర్రాజు. ప్రక్కన రంజని కుందుర్తి అధ్యక్షులు గరికపాటి చంద్రశేఖర్ వున్నారు.

క్యారీ బ్యాగ్ ఊపుకుంటూ వస్తున్న భర్తను చూసి రాబోతున్న నవ్వుని పెదాల వెనుకే దాచుకుంటూ నిన్నటి రోజు నుంచి ఈ క్షణంలోకి వచ్చేసింది చాముండేశ్వరి.

"నన్ను ఏదేదో అన్నారు యివన్నీ ఏమిటి?"

"పద... త్వరగా వెళ్లిపోదాం" కంగారుగా అన్నాడు సదాశివం.

పాపం... మీ కూతుర్ని యింటికి పిలవరూ... అదే సావిత్రిని..."

"నీ వ్యంగ్యం యింటి దగ్గర. యిక్కడగాదు... ఏదో పాత చుట్టరికంలే... యిక్కడైతే జనాలు బాగా దొరుకుతారని, అంటగట్టొచ్చని వంద కిలోమీటర్లు ప్రయాణం చేసి వచ్చింది... యిప్పుడే ఇంకో పెద్ద బ్యాచ్ దిగింది... వాళ్ళు మరీ మా దగ్గరి బంధువులు... అంతా షాపరు బ్యాగులు... సూట్‌కేసులూ పట్టుకుని దిగారు. ఒక్కొక్కరి దగ్గర ఒక్కోటన్నా కొనాల్సి వస్తుంది... పద వెళ్లిపోదాం. యివాల్టికి ఈ క్షవరం చాలు"

"మరి భోజనం..."

"చెరో ముప్పయి పెట్టి హోటల్లో తిందాం పద... అబ్బ విన్పించుకోవేం? త్వరగా పద"

"యింతకూ ఎంత?" క్యారీబాగ్‌నే చూస్తూ గారాలు పోయింది.

"ఎనిమిదివందలు" అరిచినట్టుగా అన్నాడు సదాశివం.

* * *

వారం రోజుల వరకూ పిల్లలు రారు. ఎలా గడపాలో అని బోర్ ఫీలవుతున్న చాముండేశ్వరి ముఖం కనకదుర్గ రాకతో కళకళలాడిపోయింది. అదీ కొన్ని క్షణాలే... ఆ తర్వాత మరికొన్ని క్షణాల్లోనే ఆవిడకు బందీ అయిపోయి. తలుపులకు తాళం వేసి ఆమెను అనుసరించింది.

"నువ్వు ముందు, నేను వెనుక" అంటూ నాలుగడుగులు వెనక్కు వేసి చాముండేశ్వరి చేయి పట్టుకుంది కనకదుర్గ ఎంతో ప్రేమగా... అయిష్టంగానే వెనుక వీధిలోకి నడిచి, అంత కంటే అయిష్టంగానే మునివేళ్లతో తలుపులు తట్టింది... తలుపులు తెరుచుకున్నాయి.

"రండి... రండి... నేనే సాయంత్రం మీ యింటికి రావాలనుకుంటున్నాను... అన్నట్టూ వీరెవరూ?... ఏంటీ ఊరెళుతున్నారా?" కాళింది ముఖం వెలిగిపోగా ప్రశ్నల మీద ప్రశ్నలు వేసింది.

"లేదండీ... మీ యింటికనే వచ్చాం. వీరి పేరు కనకదుర్గ... నాకు అత్తయ్యా వరుస అవుతారు. అత్తయ్యా వీరు కాళింది. వారేమో చలపతిగారు... వీరి హజ్బెండ్" అంటూ పరిచయాలు చేసింది.

కనకదుర్గ చనువుగా లోపలికి దూసుకొచ్చి, చేతిలో షాపర్ సూట్‌కేస్‌ని "అమ్మయ్యా' అంటూ క్రింద పెట్టింది... కాళింది, చలపతి ఆశ్చర్యపోయేలోపే కనకదుర్గ మొదలు పెట్టింది... 'కామ్‌వే' ప్రోడక్ట్స్ గురించి గుక్కతిప్పుకోకుండా చెప్పింది...

"మావాడు రాగానే వాడితో మాట్లాడి, ఏజెన్సీ తప్పక తీసుకునేలా చేస్తాను... ఏం ఈశ్వరీ నువ్వు మాట యివ్వకపోయినా యిచ్చావనే అనుకుంటున్నాను... మీరెవ్వరూ పరిచయం లేరుగదా... తనకోసారి మరోసారి చెప్పటం ఎందుకులే అని తననే రమ్మన్నాను... నాకూ కల్సివస్తుంది గదా... కాస్త అటువాళ్లను, యిటువాళ్లనూ పిలుస్తారా... మీలో మీకు గొడవలు, పడకపోవటాలూ ఉంటే చెప్పండి. నేనే

వెళ్తాను"

చలపతి, కాళిందీ ముఖాముఖాలు చూసుకుని, లోపలికి పరిగెత్తుతున్నట్లుగా వెళ్లి రెండు షాపర్లు... రెండు సూటుకేసులూ తెచ్చారు.

"మీది కామ్‌వే... అది చాలా నెమ్మదిగా జనాల్లోకి వెళ్తుంది... మావన్నీ 'ధనాధన్ ప్రొడక్ట్స్'. యిద్దరం చూడముచ్చటగా చెరో ఏజెన్సీ తీసుకున్నాం... యిప్పటికే ఎంతోమందిని చేర్పించాం... చెబితే నమ్మరు. యిప్పటికే కమీషన్‌గా చెరో పదిహేనువేలు వస్తున్నాయి. మావన్నీ పౌడర్స్... షాంపు పాకెట్ అంత ఫేషియల్ పౌడరే ఉంటుంది. అది పల్లీగింజ అంత అరచేతిలో వేసుకుని రెండు డ్రాప్స్ కొబ్బరి నీళ్లు వేసి పేస్ట్ చేసి ముఖానికి రాసుకోవాలి... రెండు నిమిషాల్లో మీ ముఖంలోకి యింకిపోయి, మీరు ఊహించని మార్పులు తెస్తుంది. యిక చూసుకోండి మీ అందం... ధర... వంద రూపాయలు. యిక ఈశ్వరిగారూ... మీ వాడు మరీ దబ్బణంలా ఉంటాడు గదా... మా దగ్గర యింగువ డబ్బా అంత ఓ చిన్న గాజు సీసా ఉంటుంది. విషయం చెప్పి చూపిస్తాను. రోజూ నిద్రపోయే ముందు ఓ చిటికెడు నోట్లో వేసుకుని చప్పరిస్తే చాలు... అలా నాలుగు సీసాలు వాడాడనుకోండి... గుండ్రంగా తయారవుతాడు... దాని ధర పదిహేడు వందల యాభై..."

"యిదేం ఊరింపు కాళిందీ... వాళ్లకు ప్రోడక్ట్స్ అన్నీ చూపించు" అన్నాడు చలపతి...

కనకదుర్గ మాటలు ఆపి, పరిగెత్తుతున్న ప్రవాహంలా తన ప్రోడక్ట్స్ గురించి, అవిచేసే అద్భుతాల గురించీ అనర్గళంగా చెప్పసాగింది కాళింది. కనకదుర్గ కూడా ఏమీ తక్కువ అమ్మ లేదు. పైగా ఎంతో అనుభవజ్ఞురాలు... ఎలా చెప్తే వాళ్లు నీరసపడిపోయి, తప్పదన్నట్లుగా కొంటారో ఆవిడకు బాగా తెలుసు... కానీ ఆవిడ టెక్నిక్స్ ఏవీ ఆ భార్యాభర్త దగ్గర పనిచేయలేదు. పైగా లోకల్, నాన్‌లోకల్ అంటూ మాటమార్చి 'అసలు మా ఏరియాలోకి మిమ్మల్ని ఎవరు అడుగు పెట్టనిచ్చారు?... బంధువుగా వస్తే మాంచి విందుభోజనం చేసి వెళ్లండి... అంతేగానీ ఈ ఏరియాలో యిలా ఇల్లు ఇల్లూ తిరిగితే ఊరుకునేది లేదు. మా బిజినెస్‌ని డౌన్ చేస్తారా?' అన్నారు కోరస్‌గా...

కనకదుర్గ దుర్గావతారం ఎత్తింది... యిద్దరూ భీకరంగా అరుచుకున్నారు... చలపతి దిక్కులు చూసాడు బేలగా... చాముండేశ్వరి భీతితో గుడ్లప్పగించి చూసింది... అవమాన భారాలతో ఒకరి ప్రోడక్ట్స్‌ని మరొకరు చేతుల్లో సత్తువ ఉన్నకొద్దీ రాళ్లలా విసురుకున్నారు.

* * *

చాముండేశ్వరి, సదాశివానికి ఎక్కడికైనా వెళ్లాలంటే భయం పట్టుకుంది. ఎవరైనా యింటికి వచ్చినా భయపడుతూనే ఉన్నారు. ఇంట్లో పిల్లల సందడి లేకపోవడంతో ఆ రోజు మరీ బోర్‌గా ఫీలై సినిమాకెళ్లారు...; అక్కడా ఆ బాధ తప్పలేదు... యింటర్వెల్‌లో షాపర్‌తో ఒకావిడ వచ్చింది.

"మావి 'ఓం' ప్రోడక్ట్స్... మీ ఊహకు అందనంత గొప్పగా ఉంటాయి మా ప్రోడక్ట్స్... మీ అడ్రస్ చెప్పండి. రేపు వివరాలు మరిన్ని చెబుతాను. మనం ఏం చేయనక్కర్లేదు... సింపుల్‌గా ముగ్గుర్ని చేర్పిస్తే చాలు... వాళ్ల చావు వాళ్లు చస్తారు... మనకు కమీషన్ వస్తుంది" అంటూ గబగబా చెప్పి, బలవంతంగా అడ్రస్ తీసుకుని మరో సీటు దగ్గరకు వెళ్లిపోయింది.

ఆ తరువాత సినిమా సరిగా చూడలేకపో




యారు చాముండేశ్వరి, సదాశివం.

తెల్లవారి 'మా ఫ్రెండ్ యింట్లో నిశ్చితార్థం... అక్కడ యిట్లాంటి చిరాకులేవీ ఉండవులే' అంటూ భార్యను బలవంతంగా బయల్దేరదీశాడు సదాశివం... కానీ అతని ఊహ తప్పయింది. అక్కడ ఆడపడుచు హోదాలో ఉన్న వకుళాదేవి ఒక ఫిట్టింగ్ పెట్టింది.

"నిశ్చితార్థం రోజున ఆడపడుచు కట్నం క్రింద ఏం కోరతానన్నది సస్పెన్స్‌గా ఉంచాను గదా! దాన్ని డిక్లేర్ చేస్తున్నాను. నేను 'ఓం' ప్రోడక్ట్స్‌కి ఛీఫ్ ఆర్గనైజర్ని... కొంతమంది 'ఓం' పేరుతో డూప్లికేట్సుని అమ్ముతున్నారు. దయచేసి మోసపోకండి. నాకు ఆడపడుచు కట్నం క్రింద ఓ నలభైమందిని చూపించండి. వారంతా ఏజెన్సీ తీసుకుంటే చాలు".

అంతే...

సదాశివం, చాముండేశ్వరి ట్రింగ్‌న మాయమైపోయారు.

* * *

బాస్ చింతచిగురులా దూస్తూంటే మౌనంగా ఉండిపోయాడు సదాశివం.

"ఏమయ్యా... ఏవేవో ప్రోడక్ట్స్ కొంటున్నావట... మూడు నాలుగు ఏజెన్సీలు తీసుకున్నావట..."

"నేనా?"

"ఆ... నువ్వే... అంతా అంటున్నారు... నేనే అంత పాపం చేశానా? ఆఫీసులో అంతా తీసుకున్నారు... నువ్వూ తీసుకోవాలి... ముందు ముందు నాకనునస్నల్లో ఉండాల్సిన వాళ్లు మీరు... నా అండ మీకెంతో అవసరం. వింటున్నావా?"

సదాశివానికి పిచ్చికుక్క కరిచినట్లయింది. వెంటపడి పరిగెత్తించి పరిగెత్తించి చోద్యం చూసి

నట్లుగా అయింది.

నువ్వు మంచి టాక్టివ్ పర్సన్‌వి. యిందులో నీ మిసెస్‌ని కూడా యిన్వాల్వ్ చేయి... పట్టు పడితే ఓ పట్టాన వదలరు... ఆ అనుభవం ప్రతి భర్తకూ ఉంటుందనుకో... నీకు ప ంచి కమీషన్ ఉంటుందయ్యా... నువ్వు చేర్పిస్తున్న కొద్దీ నీ కమీషన్ తారాజువ్వలా దూసుకుపోతుందయ్యా. రియల్లీ... అయామ్‌సారీ... యింతకూ నా ప్రోడక్ట్ పేరు చెప్పలేదు గదూ... 'ఫైన్ ప్రోడక్ట్...' నా భార్య పేరు మీద తీసుకున్నాననుకో... ఎన్నాళ్ళు యిలా మిడిల్ క్లాస్‌లో ఉంటావ్...? దీనితో ఒక్కోస్థాయిలో ఒక్కొక్క కమిషన్ వస్తుంది. అన్నట్టు ఓ మంచి ట్రిప్ కూడా ఉంటుంది. అదే... చెప్పానుగా నువ్వొకస్థాయికి వెళ్లినప్పుడు సౌత్ ఆఫ్రికా టూర్ ఉంటుంది".

"యింతవరకూ ఎవరైనా వెళ్లారా సార్?"

"ఆ... వెళ్లారు"

"అయితే బహుశా మళ్లీ రాకపోవచ్చు" గొణిగాడు సదాశివం... "యింకా బాగా చేస్తే టాప్‌లెవల్... అంటే చంద్రుడి దగ్గరికి కూడా పంపిస్తారు. సాయంత్రం ఓ సారి యింటికిరా... అన్నట్లు నీ భార్యను తీసుకురావడం మర్చిపోకు... మరేం లేదయ్యా... ఈ నెలలో టార్గెట్ కంప్లీటు చేస్తే అండమాన్ టూర్ ఉంటుంది" యికిలించాడు.

'అండమాన్ బదులు ఏ సహారా ఎడారికో తీసుకుపోతే మా దరిద్రం పోతుంది' గొణుక్కుంటూ మరోసారి విష్ చేసి బయటపడ్డాడు సదాశివం".

* * *

"జనాలకి ఎందుకండీ యింత డబ్బు పిచ్చి పట్టింది? ఉన్న వాళ్లు అని లేదు, లేనివాళ్లుఅని లేదు... అంతా ఎగబడిపోతున్నారు. అమ్మేవాళ్ళు ఎక్కువైతే యిక కొనేవాళ్లు ఎవరు? పుట్టకొక్కుల్లా పుట్టుకొస్తున్నాయి రకరకాల ప్రోడక్ట్స్... పైగా తీసుకోకపోతే కోపాలు... నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి సగటు మనిషి తన జీవితాన్ని ఎంత భారంగా లాక్కొస్తున్నాడు?... ఛీ ఛీ... ఎందుకర్థం చేసుకోరు వీళ్లు? వాళ్ల పబ్బం గడిస్తే సరిపోతుందా? వీటివల్ల ఎన్ని బంధుత్వాలు దెబ్బతింటున్నాయి? ఎన్ని ఫ్రెండ్‌షిప్‌లు బలి అయిపోతున్నాయి... ఏంటండీ అలా ఉన్నారు? నేను యింతగా మాట్లాడుతుంటే మీరేంటి అలా శూన్యంలోకి చూస్తున్నారు? ఏమండీ... ఏమండీ..." భుజాన్ని కుదిపి, వంగి ముఖంలోకి చూసింది చాముండేశ్వరి.

"ఐడియా..." వెలుగుతున్న ముఖంతో చిటికేశాడు సదాశివం...

అర్థంకాలేదు చాముండేశ్వరికి.

"రేపే మనమూ ఓ ప్రోడక్ట్ పెట్టబోతున్నాం"

"మనమా? యింకా నయం. పిల్లాడి యిం

---

మిల్క్ బూత్ ఇంకా తెరవలేదు. అప్పటికే చాంతాడంత క్యూ ఉంది. అప్పుడే వచ్చిన ఓ వ్యక్తి గబగబా నడుచుకుంటూ క్యూ ముందు వైపుకి వెళ్లడాన్ని గమనించిన జనం కేకలు వేస్తూ అతన్ని వెనక్కి తోసేసారు. ఆ వేగానికి క్రింద పడిపోయిన ఆ వ్యక్తి లేచి, బట్టలకంటిన దుమ్ము దులుపుకొని మళ్లీ ముందుకి వెళ్ళబోయాడు. జనానికి కోపం వచ్చి ఇంకా వేగంగా లాగి పడేసారు. అలా నాలుగుసార్లు జరిగిన తరువాత ఆ వ్యక్తి కోపంగా అన్నాడు. "ఇలా అయితే ఇవాళ మిల్క్ బూత్ తెరవనంతే..."




జనీరింగ్ చదువువెళ్లాలి. పిల్ల యింటర్ చదువు వెళ్లాలి... అదీ ఒక్క జీతం మీద..."

"హుష్... గోడకు చెవులు ఉంటాయి ఖచ్చితంగా... యిలాంటి విషయాలు గోడనుంచి డైరెక్టుగా వాళ్ల మెదళ్లలోకి వెళ్తాయి... సో... మెల్లగా చెప్తానువిను... మనం 'స్మార్ట్ ప్రోడక్ట్స్' అని ఓ కొత్త ప్రోడక్ట్‌ని సృష్టించి నామకరణం చేస్తున్నాం... నిజానికి మనం ఏవీ కొనం... ఏవీ అమ్మం... బాంబును కాళ్ల దగ్గర పెట్టి వెలిగించే ప్రయత్నం చేస్తాం... అర్ధమయిందా? ఎవరు యింటికి వచ్చినా, మనం వెళ్లినా మన స్మార్ట్ ప్రొడక్ట్స్ కొనమని, ఏజెంటుగా ఉండమని వాళ్లు మనకు తిరిగి కనబడని విధంగా నానా హింసపెడతాం... యిక నోరెత్తరు – అమ్మా... మనతో ఆడుకుంటారా? హ... అంత వెర్రిపప్పలు యిక్కడెవ్వరూ లేరు... మనకు క్రీమ్ పూస్తారా? యిప్పుడు మా బాస్ యింట్లో ఉండడు... పద... మా బాస్ మిసెస్‌ని 'కాకా' పడదాం... ప్రారంభం అక్కడి నుంచే అంటూ వికటాట్టహాసం చేసాడు సదాశివం...

"ఏమండీ..."

"హు... ఎక్కడికీ వెళ్లే ఆశలేదు... ఎక్కడా ప్రశాంతంగా ఉంటామన్న నమ్మకం లేదు... ఒక్క మనిషి చుట్టూ యింతమంది చేరి ప్రోడక్ట్స్ పేరుతో యింతగా భయపెట్టి మన చేత పరుగులు తీయిస్తారా?... కాచుకోండి జనాల్లారా... నృసింహఅవతారంలో నేను, ఆదిశక్తి అవతారంలో మా ఈశ్వరి మీ మధ్యకు వస్తున్నాం... యిక పరుగులు తీయటం మీపని... వెనక మేము తరుముతూంటే ఎంతని పరిగెడతారు? ఆగిపోతారు ఖచ్చితంగా... అప్పుడు మీరంతా మాకు బందీలే"... పట్టలేని ఆనందంతో పెద్దగా అరిచాడు.

"యింక ఆపండి మీ సోది... ముందు మీరు పరిగెత్తండి. మీ బాస్ మిసెస్ వస్తోంది" పళ్లబిగువున అతని వాక్ప్రవాహానికి ఆనకట్ట వేసింది చాముండేశ్వరి.

కిరణ్మయి పెళ్లికి వెళ్లివచ్చినప్పటి నుంచీ కైవల్య మనసు మనసులో లేదు.

తానెంతో అభిమానించే తన ప్రియనేస్తం జీవితం... ఇక నరకప్రాయంగా మారనున్నదనే ఆలోచన ఆమెని తీరని ఆవేదనకూ, అశాంతికీ గురిచేస్తోంది.

బి.ఎస్‌సి. ఇద్దరూ కలిసే చదివారు. డిగ్రీ ఫైనలియర్ పరీక్షలు రాసి అలా వెళ్లిందోలేదో... అంతలో ఏం కొంపలు మునిగాయనో... వాళ్ల నాన్న నెలరోజుల్లోనే ఆ సంబంధం ఖాయం చేసేసి ముహుర్తాలు పెట్టించాడు.

కిరణ్మయి అసలే అమాయకురాలు, తండ్రి చెప్పిన మాటకి ఎదురుచెప్పే ధైర్యం ఆమెకి లేదు. కానీ అన్యాయంగా ఒక దుర్మార్గుని చేతిలో చిక్కిందిప్పుడు. ఇప్పుడా మానవ రూపంలో వున్న మృగం దాని బతుకుతో ఎలాంటి క్రూరమైన ఆటలు ఆడనున్నాడో కదా... అనుకుంటూ కుమిలిపోసాగింది కైవల్య.

పెళ్లి పీటలమీద మందారపువ్వులాంటి కిరణ్మయి పక్కన... కింకరుని వంటి ఆ దినకర్‌ని చూడగానే ఆమెకు మతిపోయినంత పనైంది. కిరణ్మయిని మనసులోనే తిట్టుకుంది. కనీసం ఒక లెటరయినా రాయలేదు తనకు... ఈ పెళ్లీ, పెళ్లికొడుకు గురించి!

ఒక్కక్షణం కైవల్యలో ఆవేశం లావాలా చిమ్ముకువచ్చింది. వెంటనే కిరణ్మయి తండ్రి వద్దకు వెళ్లి ఆ దినకర్ నిజస్వరూపం ఏమిటో చెప్పేసి, ఈ పెళ్లి ఆపుచేద్దామా అన్నంత టెన్షన్ కలిగింది. కానీ అవన్నీ అంత సులభంగా జరిగే విషయాలు కావని, ఇప్పుడు చేయగలిగేదేమీ లేదని గ్రహించి... తనను తాను కంట్రోల్ చేసుకుని కాసేపు అటూఇటూ తిరుగుతూ అక్కడ గడిపి, ఉండబట్టలేక వెనక్కి వచ్చేసింది.

ఓ వైపు కిరణ్మయిపై దిగులు, మరోవైపు



# ఆత్ ది బెస్ట్

దినకర్ మీద కోపంతో... ఆమె మనసు అతలా కుతలం అయిపోతోంది.

దినకర్, కైవల్య బావ శ్రీరామ్ క్లాస్‌మేట్. తరచూ ఇద్దరూ కలిసి కైవల్య ఇంటికి వస్తుండేవారు.

శ్రీరామ్‌కి కైవల్యతో స్నేహమే తప్ప ప్రేమ, పెళ్లి లాంటి ఆలోచనలు లేవు. ఎందుకంటే అతను అప్పటికే మరో అమ్మాయిని ప్రేమిస్తున్నాడు.

ఒకరోజు తన ఎదురింటి నిత్యతో కబుర్లు చెబుతూ వుండగా... వచ్చారు వాళ్లిద్దరూ. నిత్యను పరిచయం చేసుకున్నారు. ఇదంతా చాలా క్యాజువల్‌గా జరిగిపోయింది.

ఆ తరువాత దినకర్ మళ్లీ కనిపించలేదు. సుమారు రెండు నెలల తరువాత కారణమేమిటని అడిగింది కైవల్య శ్రీరామ్‌ని.

కాలేజీకి వస్తూనే వున్నాడనీ, కానీ తనతో ఎక్కువగా తిరగడం లేదనీ అన్నాడు.

"ఎందుకు? మీ ఇద్దరి మధ్య ఏదైనా గొడవ జరిగిందా?" అంది కైవల్య.

"లేదు. కానీ... అతడి ధోరణి నాకేం నచ్చలేదు" అన్నాడు శ్రీరామ్.

"ఏం జరిగింది?"

"నువ్వారోజు పరిచయం చేశావే... ఆ నిత్య... ఆమెని ప్రేమించి మోసం చేశాడని... ఒక పుకారు..."

కైవల్య దిగ్భ్రాంతిగా చూసింది. ఇదంతా తనకస్సలు తెలియదు. నిత్య ఏనాడూ ఈ విషయం చెప్పనేలేదు.

"వివరాలు చెప్పు" ఆవేశంగా అంది.

"నాకేం తెలుసు? నేనడిగితే ఇది తన పర్సనల్ మేటర్ అని, ఏమీ కామెంట్ చేయలేననీ అన్నాడు. ఇంక నిత్యను నీవే అడగాలిమరి" అన్నాడు.

ఆరోజు సాయంత్రం నిత్యని ఇంటికి పిలిపించి, మెల్లగా విషయం కదిపింది కైవల్య.

"నువ్వు దినకర్‌ని ప్రేమించావా? నాకు చెప్పనేలేదే!"

"వాడొక స్టుపిడ్. వాడి సంగతి వొదిలెయ్ కైవల్యా" అది నిరాసక్తంగా.

"అంత తొందరగా మీ మధ్య ప్రేమ ఎలా ఏర్పడిందసలు?!"

"ఏముంది.. ఓసారి ఓషన్ పార్క్‌లో కలిసాడు. ఎక్కువసేపు మాట్లాడుతూ గడపడం జరిగింది. నా జీవితంలో అతి దారుణమైన ఫెయిల్యూర్ ఇది. రాస్కెల్! అసలు వాడి గురించి మాట్లాడకు... ఒళ్లు మండిపోతోంది" అంది నిత్య.

ఆ తరువాత దినకర్ గురించి దాదాపు మరచిపోవడం జరిగింది. కానీ అనుకోకుండా వాడు తన ఫ్రెండ్ కిరణ్మయి మొగుడయి కూర్చున్నాడు.

కైవల్యకంతా కన్‌ఫ్యూజింగ్‌గా వుంది.

ఒక ఫ్రెండ్‌గా పరిచయమయ్యాడు. ఒక

కె. లక్ష్మీకాంతమ్మ

ఫ్రెండ్‌ని మోసం చేశాడు. ఇంకో ఫ్రెండ్‌కి తాళి కట్టి ఇప్పుడామెని ఏంచేయనున్నాడో! ఈ దినకర్ నుంచి కిరణ్మయిని జాగ్రత్తగా వుండమని హెచ్చరించాలి... అనుకుంది చివరికి.

టేబుల్‌పై పడివున్న కిరణ్మయి వెడ్డింగ్ కార్డ్ చెప్పలేని భయాన్నీ, జుగుప్సనీ పుట్టిస్తోంది.

వెంటనే లేచి, చెప్పులు వేసుకుని తన పర్సు తీసుకుని బయటకు నడిచింది.

వీధి చివరన ఉన్న టెలిఫోన్ బూత్‌లోకి వెళ్లి, కిరణ్మయి ఇంటికి ఫోన్ చేసింది. అప్పటికి పెళ్లి తతంగం అంతా అయిపోయి ఉంటుంది కాబట్టి తనతో మాట్లాడడం పెద్ద కష్టమేం కాదు.

"ఎవరూ?" అంటూ అడిగారెవరో అవతల్నుండి.

"నేను... కిరణ్మయి స్నేహితురాలిని... పేరు కైవల్య. ఒకసారి అర్జంట్‌గా తనని పిలుస్తారా?" అంది.

"లైన్లో ఉండండి."

సుమారు నిమిషం తరువాత...

"హలో కైవల్యా..."

"హలో"

"ఏంటే నువ్వు?... అలా కన్పించి ఇలా మాయమయ్యావ్? నీకోసం పిచ్చిదానిలా వెదికాను తెల్సా?"

"కిరణ్మయీ... నాకు నీగురించి బెంగగా వుందే... నీజీవితాన్ని నాశనం చేసాడు మీ నాన్న అనిపిస్తోంది."

"ఏంటే నువ్వు మాట్లాడేది? నాకేమీ అర్థం కావడంలేదు. వివరంగా చెప్పు" కంగారుగా అంది కిరణ్మయి.

"కనీసం ఒక్కసారైనా నాకు ఫోన్ చేసి... నువ్వు చేసుకోబోయే మనిషిని గురించి నాకు చెప్పి ఉంటే ఈ ఘోరం జరగనిచ్చేదాన్ని కాదే"

"టైమ్ దొరక్క చెప్పడానికి వీలుకాలేదు. కానీ ఇప్పుడంత బాధపడే విషయం ఏం జరిగిందే?"

"బాధపడే సంగతే. కానీ ఎలాంటి బాధో నేను ఊహించలేను. అతను... అతన్ని నచ్చే నువ్వు పెళ్లికి ఒప్పుకున్నావా?"

"అవును... ఎందుకు?"

"అతన్నాకు తెలుసు. అతన్ని నమ్మడానికి వీల్లేదు"

కాస్సేపు నిశ్శబ్దం ... అవతలవైపు కిరణ్మయి షాక్‌తిని ఉంటుందని గ్రహించిన కైవల్య...

"హలో... హలో కిరణ్మయీ..." అంది.

"ఆ.. హలో... కైవల్యా...అతని గురించి నీకేంతెలుసు? తొందరగా చెప్పవే. నాకు దడగా ఉంది..." కంగారుగా అడిగింది కిరణ్మయి.

"అతను... నా ఫ్రెండ్ నిత్యని ప్రేమించి మోసం చేశాడు"

"నిత్యా?"

"అవును... మా ఎదురింటమ్మాయి. అతను మా బావతో కలిసి మా ఇంటికి వస్తుండే వాడు. నేనే పరిచయం చేసానా అమ్మాయిని."

"దినకర్ నిత్యని మోసం చేసాడని నిత్యే చెప్పిందా?"

"కాదు... తెలిసింది. నిత్యనడిగితే మాట దాటేసింది."

"అబ్బ... హడలగొట్టావు కదే! ఇంకా ఏమిటో అనుకున్నాను".

"అదేమిటే! ఇక్కడ నీ గురించి నేను దిగులు పడుతుంటేనూ..." అంది కైవల్య అయోమ




యంగా.

"సారీ కైవల్యా... దినకర్ అలాంటివాడు కాదు. నాకంతా చెప్పాడు. దినకర్ తన కోసం పడిచచ్చేలా చేసుకుంటానని నిత్య ఎవరితోనో బెట్ కట్టిందట. పాపం నిత్యకి తెలీదు... ఆల్‌రెడీ దినకర్ మరొకరికి ప్రేమలో బుక్కైపోయాడని.

అసలు విషయం తెలిసాక బెట్ ఓడిపోయాననే ఉక్రోషం పట్టలేక దినకర్ గురించి అలా చెడుగా పబ్లిసిటీ ఇస్తున్నదేమో!"

కైవల్య ఆశ్చర్యపోయింది.

"ఇదంతా నీకు దినకర్ చెప్పాడా? ఇదంతా నిజమేనని నువ్వెలా నమ్ముతున్నావ్?" అడిగింది కైవల్య.

"ఎలాగంటే... పిచ్చిదానా.. దినకర్‌ని నిత్య కంటే ముందే నేను ప్రేమించాను. అతనితో పెళ్లి చూపులు జరిగిపోయి చాలా రోజులే అయింది. అయితే మా పెళ్లి విషయం ఎవ్వరికీ తెలీకుండా సడెన్ సర్‌ప్రైజ్‌గా వుండాలనే ఉద్దేశ్యంతో మా ప్రేమ గురించి ఎక్కడా లీక్ కానీయలేదు. ఈవెన్... నీక్కూడా చెప్పలేదు. అందుకే దినకర్ నిత్య ప్రేమ తిరస్కరించాడు గానీ మరో ఉద్దేశ్యంతో కాదు. నిజానికతను అందరితోనూ జోవియల్‌గా వుంటాడే తప్ప ప్రిన్సిపుల్స్ ఉన్న మనిషి. ఎవరో ఏదో తప్పుగా అర్థం చేసుకుంటే తప్పు అతనిది కాదుగా...

అయినా థ్యాంక్యూ కైవల్యా... నా మీదున్న అభిమానం, ప్రేమతో నాగురించి వర్రీ అవుతూ ఫోన్ చేశావు. నీలాంటి ఫ్రెండ్ ఉన్నందుకు నాకెంతో గర్వంగా ఉంది "అంది కిరణ్మయి.

"కానీ నాకు మాత్రం అలా అనిపించడం లేదు. అర్థం లేని క్రేజీతో క్లోజ్ ఫ్రెండ్స్‌క్కూడా ఇలాంటి ముఖ్యమైన విషయాలు చెప్పకుండా ఉండడం పరిపక్వత అనిపించుకోదు. విశ్వాసం ఉన్నప్పుడే స్నేహం విలసిల్లుతుంది. ఆల్‌ది బెస్ట్. బై..." అంటూ ఫోన్ పెట్టేసింది కైవల్య ఉక్రోషంగా.

కార్గిల్ యుద్ధరంగం మంచు జ్వాలల్లో జ్వలిస్తోంది.

యుద్ధరంగానికి బాగా ఇవతల ఒక సైనిక శిబిరంలో కమాండర్ల సమావేశం జరుగుతోంది. నాగా, గఢ్వాల్, గ్రెనెడియర్ బెటాలియన్ కమాండర్లు, బ్రిగేడ్ కమాండర్ అధ్యక్షతన సమావేశమయ్యారు.

మే 14 (1999) న చొరబాటుదారుల సాహసాన్ని పసిగట్టిన 18 గ్రెనెడియర్ బెటాలియన్ యోధులు లోయను విడిచిపోవాల్సిందిగా శత్రువుల్ని పలుమార్లు హెచ్చరించారు.

ఆ హెచ్చరికల్ని హేళనచేస్తూ, శత్రువులు కవ్వింపు చర్యలుగా తూటాలు కురిపించారు. ఆగ్రహంతో గ్రెనెడియర్లు ఎదురు కాల్పులు జరిపారు. కానీ, పటిష్టమైన బంకర్లలో సురక్షితంగా తలదాచుకుంటున్న శత్రువులకు ఎలాంటి నష్టమూ వాటిల్లలేదు. అప్పుడు గానీ భారతసైన్యానికి పరిస్థితి తీవ్రత అర్థం కాలేదు.

తొలిదశలో కార్గిల్‌లోని 121 బ్రిగేడ్ కమాండర్ ఒకరు ప్రాథమిక సమాచారం ప్రకారం చొరబాటుదార్లు 8-10 మందికి మించి ఉండరని భావించి, గ్రెనెడియర్ కమాండింగ్ ఆఫీసర్‌తో "కొండ శిఖరం మీద నుంచి చొరబాటుదారుల్ని మెడపట్టి కిందకి తీసుకురండి" అని ఆదేశించారు.

మొత్తం యుద్ధంలో జరిగిన ఘోరతప్పిదం ఇదే!

కీలకమైన టోలోలింగ్ శిఖరం మీద నుంచి శత్రువులు శ్రీనగర్-లే రహదారి మీద నుంచి వెళ్తున్న భారత సైనిక ట్రక్కులను గురిచేసి పేల్చివేయనారంభించారు. కేవలం దైవసహాయం వల్లనే కొన్ని ట్రక్కులు వాటిబారిన పడకుండా దాటి వెళ్లాయి.

కార్గిల్ యుద్ధరంగంలో గల ప్రముఖ శిఖరాలు టైగర్‌హిల్, టోలోలింగ్ పాయింట్ 5143. రాకీనాబ్, దిహరిప్ స్థావరాలు పాయింట్ 5143 కీ టోలోలింగ్ శిఖరానికీ మధ్య సురక్షిత బంకర్లతో శత్రువుల అధీనంలో ఉన్నాయి. పాకిస్థాన్ వైపు నుంచి ఈ శిఖరాలు ఎక్కడం సులభం. అవి అటువైపు ఏటవాలుగా ఉన్నాయి. భారత్‌వైపు నిట్టనిలువుగా ఉన్నాయి. వీటిని మొక్కవోని స్థైర్యంతో, పట్టుదలతో సైనికులు అధిరోహించారు.

ఒక్కొక్క సైనికుడు సుమారు 24 కిలోల సరంజామాను తన వెంట తీసుకువెళ్లాల్సి ఉంటుంది. అందులో ఉక్కు శిరస్త్రాణం (1.2 కిలో) ఇన్సాస్ (ఎస్ఎల్ఏ) రైఫిల్ (4.5 కిలోలు), ఆపద్ధర్మ ఆహారంగా బెల్లం ముక్కలు, పిండి, చాక్లెట్లు వగైరాలు (సుమారు 2 కిలోలు) కనీసం వంద తూటాలు (3.2 కిలోలు), పడక (2 కిలోలు), నీటి బుడ్డి (1.4 కిలో), ప్రత్యేక పరికరాలు (ఉలి, కొక్కేలు, తాడు వగైరాలు - 1 1/2 కిలోలు), పర్వత ప్రాంత దుస్తులు (క్రింది జాకెట్, ట్రవుజర్లు, థర్మల్ వెస్ట్‌లు, టోపీ, కళ్లద్దాలు, మంచులో వాడే బూట్లు - 7 1/2 కిలోలు).

ఇవికాక సైనికులు మరతుపాకులను, రాకెట్ లాంచర్లను, అవసరమైన మందుగుండునూ వంతులవారీగా తీసుకువెళ్లాలి.

మే 22 న గ్రెనెడియర్స్ తమ కార్యకలాపాలను ప్రారంభించినప్పుడు నెత్తురు వరదలై ప్రవ

కాటూరు రవీంద్రత్రివిక్రమ్

సిపాయిలు దేశమాతకి ముద్దు పాపాయిలు. ప్రాణాలను పణంగా పెట్టి, మన సరిహద్దుల్ని సదా రక్షిస్తూంటారు. వారి వీరగాథలు యువతకి ఆదర్శం, స్ఫూర్తిదాయకం కావాలి.

ఈ కథలు వాస్తవ సంఘటనల నేపథ్యంతో రచించబడ్డాయి. రచయిత శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ *1964* నుంచి *1980* వరకు వైమానిక దళంలో పనిచేసిన కాలంలో స్వయంగా రెండు యుద్ధాలలో పాల్గొన్నారు. మిలట్రీ ఆస్పత్రిలో చికిత్సపొందుతున్న అనేక మంది యుద్ధవీరుల విజయగాథల గురించి వివరాలు సేకరించారు. యుద్ధరంగం వేదికగా, దేశభక్తి ఊపిరిగా, త్రివిధ దళాల యుద్ధవీరులు సజీవ పాత్రలుగా వెలువడు తున్న ఈ కథలు 'కథాకేళి' పాఠకులకు ప్రత్యేకం.

హించింది. దీనితో తాము తలపడుతున్నది ఎలాంటి శత్రువుతో అన్నది దిగువన ఉన్న తక్కిన బెటాలియన్లకు కొంత తెలిసివచ్చింది. వీరికి రక్షణ కవచం అనేది లేనేలేదు. గుట్టల పొడవునా చొరబాటుదారులు బంకర్లు త్రవ్వు కుని, ఇనుప చట్రాలతో కోటలు కట్టుకున్నారు. వీరి కాల్పుల వల్ల సైనికులు ముందుకు వెళ్లటం అసాధ్యంగా మారింది. మరొక గ్రెనేడియర్ విభాగానికి చెందిన రెండు ప్లాటూన్‌లు టోలో లింగ్‌కు దిగువన ఉన్న వేరొక గుట్ట మీద 16 రోజులపాటు దిగ్బంధమైపోయారు. కొండ కొమ్ముల మీద నుంచి వీరి మీదకు శత్రువులు గురి చూసి కాల్చగలుగుతున్న సమయంలో ఆత్మరక్షణే గగనమైంది.

ముందుకు కదలాలంటే – కృష్ణపక్షం రాత్రు ల్ని, ప్రతికూల వాతావరణాన్నీ అడ్డంగా ఉం చుకునే వెళ్లాలి. తుపాకీ పేలిన శబ్దాలు గాలి రొదలో కలిసిపోవాలి. లేదంటే వాతావరణ ఉష్ణోగ్రత మైనస్ పదకొండు డిగ్రీలకు పతనం కావాలి. అలాంటి సమయంలో మాత్రమే సైని కులు ఎలాగో ఒకలాగా ముందుకు వెళ్లగలరు. దిగువన ఉన్న ప్రధాన సైనికస్థావరం నుంచి 16 వేల అడుగుల ఎత్తునగల ఈ శిఖరాలను చేరుకోవటానికి ఈ వాతావరణానికి అలవాటు పడిన బలిష్ఠుడైన వ్యక్తికి పదకొండు గంటల సమయం పడుతుంది.

అయితే శత్రువు కురిపిస్తున్న తుపాకీ గు ళ్లకు ఎదురీదుతూ అంగుళం అంగుళం చొప్పు న కొండవాలు మీద పాకుతూ ముందుకు వెళ్ల టం మృత్యువుకు ఎదురీదడమే!

'బర్‌బాద్ బంకర్'గా పిలువబడిన శత్రు స్థావరం టోలోలింగ్ శిఖరానికి వెళ్లే దారిలో ఉంది. అది ఒక చిన్న శిఖరం మీద పకడ్బం దీగా నిర్మితమై ఉంది. అక్కడ నుంచి కురుస్తున్న తూటాల వర్షానికి చాలా మంది భారత జవాను లు వీరస్వర్గమలంకరించారు. దాంతో ఆ బంక ర్‌ని గట్టిగా దెబ్బతియ్యడానికి రంగం సిద్ధమ యింది. టోలోలింగ్ శిఖరానికి గురిపెట్టి దాదా పు 120 బోఫోర్స్ ఫిరంగుల్ని మోహరించారు.

ఈ ఫిరంగుల్ని అతి కష్టం మీద విడిభాగాల రూపంలో, వివిధ పద్ధతులలో యుద్ధరంగానికి చేర్చారు. అత్యవసరం కాబట్టి, అధిక మూల్యం చెల్లించి, సమృద్ధిగా ఫిరంగి గుళ్లను కొనుగోలు చేసి, అక్కడకు చేర్చారు. అవి పదివేలకు పైగానే ఉన్నాయి. వాటిలోంచి కనీసం పదివేల గుళ్లను (ఇది 50,000 కిలోల టి.ఎన్.టి.కి సమానం) బోఫోర్స్ ఫిరంగుల ద్వారా టోలోలింగ్ శిఖరాల మీదకు ప్రయోగించారు. ఈ పేలుడు పదార్థం తో న్యూఢిల్లీ వంటి నగరాన్ని చాలావరకూ ధ్వం సం చేయవచ్చు.

బోఫోర్స్ దాడి దెబ్బకి భారత జవాన్లను చికాకు పరిచిన పటిష్ఠమైన శత్రు స్థావరం 'బర్ బాద్ బంకర్' (నాశనమైన స్థావరం)గా మారి

పోయింది.

ఇక సైనికులు ముందుకు వెళ్లి దాడి చేయటానికి పథకం ప్రారంభమయింది. సైనిక బృందాలకు మహాభారతంలోని భీమ్, అర్జున్, అభిమన్యు - వంటి వీరుల పేర్లు సంకేతాలుగా పెట్టారు.

రాజ్‌పుతానాకి చెందిన లెఫ్టినెంట్ వైజయంత్, హిందీ సినిమా 'బోర్డర్' లోని ఉత్తేజకరమైన పాటల్ని టేప్‌రికార్డర్ ద్వారా సైనికులకు వినిపిస్తూ వారిని సమర సన్నద్ధులను చేసారు.

శతఘ్నుల కాల్పులు ఆగిన వెంటనే సైన్యం తన దాడిని ప్రారంభించింది. ఒకరు నేరుగా పైకి ఎగబ్రాకగా, మరి కొందరు శత్రువు వెనక్కి మళ్లినా ఎదుర్కొనేందుకు వలయాకారంలో ముందుకు సాగారు. గ్రెనెడియర్ల బృందం ఒకటి మంచుపులుల్లా ముందుకి సాగింది.

ఫిరంగి గుళ్లతో ఏర్పడిన గుంతలను భారతీయ సైనికులు తమ తలదాచుకోవటానికి వినియోగించుకున్నారు. కొన్ని చోట్ల వారు తమకు ఆధారంగా ఒంటి చేత్తోనే రాళ్లను పట్టుకున్నారు. వారు పైకి ఎగబాకుతున్న కొద్దీ పైనుంచి మళ్లీ కాల్పులు ప్రారంభమైనాయి. అంటే - శత్రువులు ఎంత పటిష్ఠమైన స్థావరాల్లో తల దాచుకున్నదీ ఊహించుకోవచ్చు. పదివేల బోఫోర్స్ శతఘ్నుల గుళ్లకు కూడా వాళ్లు చలించ లేదు! పదులు, వందల సంఖ్యలో ఉన్న శత్రువుల్ని మట్టుబెట్టటానికి మనం వేల సంఖ్యలో (నాలుగు డివిజన్లు) సైనికుల్ని వినియోగించాల్సి వచ్చిందంటే యుద్ధరంగం ఎంత ప్రతికూలంగా ఉన్నదీ గ్రహించవచ్చు. 1965 నాటి పాక్ యుద్ధంలో 'హాజీపీర్' కనుమను పట్టుకునేందుకు పడిన కష్టంతో దీనిని పోల్చవచ్చు. అప్పట్లో ఆ యుద్ధం 32 రోజులపాటు సాగిన నరకం. ప్రస్తుత యుద్ధంలో కీలకమైన శిఖరాలు పట్టుకోవటానికి నెల రోజులకు పైగానే సంఘర్షణ జరుగుతోంది.

కార్గిల్ శిఖరాలను ఎక్కే సమయంలో సైనికులు మోసే ప్రతి గ్రామూ అదనపు భారమే! ఇటు తిండి పదార్థాలు, అటు మందుగుండు



టోలోలింగ్ శిఖరాగ్రానికి చేరుకునేందుకు గుట్టల చాటున నక్కుతూ ముందుకు వెళుతున్న భారతీయ సైనికులు.



'బర్‌బాద్ బంకర్' మీద ఫిరంగి గుళ్ల వర్షం కురిపిస్తున్న బోఫోర్స్ ఫిరంగులు

– ఈ రెండింటిలో ఏది ఎంత కావాలనేది జాగ్రత్తగా నిర్ణయించుకోవాల్సి ఉంటుంది. రెండు కిలోల ఆహార పొట్లం వంద తూటాలకు సమానం. చాలామంది సైనికులు ఆహారం కన్నా బుల్లెట్లనే ఎంచుకుంటారు.

జూన్ (1999) 2 వ తేది –

రాత్రి సమయం.

గ్రెనెడియర్స్ చొరబాటుదార్లపై తమ నాల్గవ దాడి సాగించారు. ఇది కూడా మునుపటి మాదిరి భీకరమైనదే. ఇంతవరకూ భారతసైన్యం ఎక్కువ ప్రాణ నష్టాలు పొందుతోంది. మోర్టార్లను, ఫిరంగుల్ని ప్రయోగించి, శత్రు స్థావరాలను పేల్చివేసి, వాటిని తమ అదుపులోకి తెచ్చుకోవటం అనుకున్నంత సులభంగా జరగటం లేదు. కారణం – పటిష్ఠమైన వాటి నిర్మాణం.

'టోలోలింగ్'ని స్వాధీనం చేసుకోవటానికి మన సైన్యం చేసిన అనేక ప్రయత్నాలను శత్రువులు ఎదురు కాల్పులతో భగ్నం చేసారు. భారత సైన్యపు పట్టుదల మరింత పెరిగింది.

తర్వాత తొమ్మిది రోజుల్లోనూ మరో ఎనిమిది బ్యాటరీలను (ప్రతి బ్యాటరీలోనూ ఆరు బోఫోర్స్ హోవిట్జర్లు, మధ్య తరహా గన్‌లుంటాయి.) తెప్పించుకోవటం ద్వారా సైన్యం తన ఫిరంగి దళ సామర్థ్యం పెంచుకుంది. జూన్ 12 న తుది దాడి మొదలు పెట్టటానికి ఒక వారం ముందు అచ్చం టోలోలింగ్ శిఖరం మాదిరిగానే ఉన్న మరొక శిఖరం మీద ప్రాక్టీసు దాడి చేసాయి. తర్వాత ఇసుకతో, మట్టితో, రాళ్లతో, టోలోలింగ్ నమూనా శిఖరాన్ని రూపొందించి, దాడి చేయటానికి ఉపయోగించాల్సిన వివిధ మార్గాలను అధ్యయనం చేసి, పథకాలు రచించారు. ప్రయోగం చేసిన సమయంలో – చాలా కాలం నిల్వ ఉంచిన మందుగుండులో పనికిరాని గ్రెనేడ్లను గుర్తించి, అవతల పారేసారు. కొండల మీదకి పెద్ద మొత్తంలో మందుగుండు సామాగ్రిని చేరవేయటంలో సైనిక దళానికి చెందిన రజకులు, చర్మకారులు, క్షురకులు – ఒక్కో సైనికుడికీ నలుగురు చొప్పున సహాయపడ్డారు.

టోలోలింగ్ శిఖరాన్ని పట్టుకునేందుకు సాహసించిన వీరులలో కెప్టెన్ సచిన్ నింబాల్కర్, కల్నల్ రవీంద్రనాథ్, మేజర్ గుప్తా, జె.సి.వో. భన్వర్ సింగ్, 23 సంవత్సరాల వయస్సు గల లెఫ్టినెంట్ పర్వీణ్‌తోమార్ (ఈయన్ని బేబీ ఆఫ్ ది బెటాలియన్ అని పిలిచేవారు) చెప్పుకోదగినవారు. మరెందరో సిపాయిలు... వారి పేర్లు




మంచుకొండల గుండెల్లో పదిలంగా ఉన్నాయి.

మేజర్‌గుప్తా, జె.సి.వో. భన్వర్‌సింగ్, వారి ఆరుగురు సహచరులు యుద్ధరంగంలో వీర స్వర్గమలంకరించారు. వారి సాహసగాథలకు ఆ కొండలే శాశ్వత సాక్షులు.

ఎట్టకేలకు 'టోలోలింగ్ శిఖరం' భారత సైనికుల వశమైంది.

అది కీలక విజయమని చెప్పితీరాలి. ఆ విజయోత్సాహంలో సిపాయిలు ఉల్లాసంతో కేరింతలు కొడ్తూ, తమ ఆయుధాలను గాల్లోకి ఎత్తి పట్టుకుని ఆనందం పంచుకున్నారు.

టోలోలింగ్ శిఖరం మన వశం కావడంతో, దానికి చుట్టు పక్కలనున్న శిఖరాలపై తిష్ఠ వేసిన చొరబాటుదారుల నుంచి ప్రతిఘటన బలహీనపడింది.

జూన్ 13 నాటికి టోలోలింగ్‌కి ఆగ్నేయంగా సుమారు 100 మీటర్ల దూరంలో ఉన్న 'బర్ బాద్ బంకర్' ని, పాయింట్ 4590 శిఖరాన్నీ రాజ్‌పుతానా రైఫుల్స్ తమ స్వాధీనంలోకి తెచ్చుకుంది.

జూన్ 14 నాటికి గ్రెనెడియర్స్ శిఖరాగ్రానికి చేరుకున్నారు. ఆ తర్వాత మూడు రోజుల్లో మిగతా శిఖరాలు మన వశమైనాయి. మృతుల్లో 50 మంది చొరబాటుదార్లు కాగా, మిగిలిన వారు పాకిస్థాన్ ఉత్తరపదాతి దళానికి చెందిన వారు.

శత్రు స్థావరాల్లో సమృద్ధిగా నిల్వ ఉంచిన నెయ్యి, డబ్బాల్లో భద్రపరచిన అనాస పళ్లు, తేనె, వెన్న ప్యాకెట్లు మన సైనికుల విజయోత్సవానికి విందుగా ఉపకరించాయి.

ఇప్పుడు ఆ స్థావరాల్లో మన సైనికులు అప్రమత్తంగా పహరా కాస్తున్నారు. యుద్ధం చాలా పాఠాలు నేర్పుతుంది. అయితే వాటిలో కొన్ని ఖరీదయిన పాఠాలుంటాయి.

(ఇండియా టుడే సౌజన్యంతో...) ●

తెలతెలవారుతున్న అలికిడికి కృష్ణవేణమ్మ నిద్రలేచింది. మామూలుగా తెల్లవారుజామునే లేచి ఆమె ఎంతో ఉత్సాహంతో పనిపాటలు చేసుకునేది. కానీ ఆ రోజు ఆమెకి మంచంమీద నించి లేవబుద్ధి పుట్టలేదు. మసక చీకటి చూస్తుంటే వయసు బలవంతాన మీద పడే తన నల్లటి నిడుపాటి వెంట్రుకలు అప్పుడప్పుడే నెరసిపోతున్నట్టుగా ఉంది. వరండాలోంచి ఆకాశం వెలిసిపోయిన నల్లటి వస్త్రంలా ఉంది. ఆమె దిగులుగా రవీంద్రవైపు చూసింది. నిద్రలో అతను పక్కకి కదిలాడు. నిద్రలో కూడా ఆ వదనంలో ఏదో నిస్పృహ. ఎన్నేళ్లు చేసినా ఆ గుమాస్తా ఉద్యోగంనించి మోక్షం లేదు. జీవితంలో తమకేమీ చెప్పుకోదగ్గది లభించకపోయినా ఒకే ఆశ మినుకు మినుకుమంటూ వెలుగుతోంది. కానీ ఈ గోపీ -

గోపీ దగ్గాడు.

"చిరంజీవ" అనుకుంది కృష్ణవేణమ్మ.

నిద్రలోనే దిండు కింద తడిమి సిగరెట్ పెట్టె తీసి, బలవంతాన కళ్లు సగం తెరిచి, సిగరెట్ తీసి ముట్టించాడు గోపీ.

కృష్ణవేణమ్మ మనస్సు చివుక్కుమంది. మొదట మొదట చాటుగా సిగరెట్లు తాగేవాడు. ఒకసారి బయటపడేసరికి ఆ బెరుకుకూడా పోయింది. పైగా "సిగరెట్ తాగకపోతే మెదడు చురుకుగా ఉండదు, చదువు సాగదు, నేనేం ఫ్యాషన్‌కోసం తాగటంలేదు. కష్టపడి చదివి మెడిసిన్‌లో సీటు సంపాదించుకోవాలని మీరేగా పోరు పెట్టేది" అంటాడు. గోపీ మళ్ళీ దగ్గాడు. "శతాయుష్షు".

పాడు దగ్గు, చదువు సంగతి ఎలా ఉన్నా ఈ సిగరెట్లవల్ల దగ్గు ఒకటి పట్టుకుంది. మనసుండబట్టక కృష్ణవేణమ్మ గోపీ మంచం దగ్గరి కెళ్ళి అతని గుండె నిమిరింది.

"దగ్గు వస్తోంది బాబూ, సిగరెట్లు తాగటం తగ్గించకూడదూ?"

"ఊఁ" అంటూనే మళ్లీ దగ్గాడు గోపీ.

"చిరంజీవ" అంటూ కృష్ణవేణమ్మ మరి కాసేపటికే 'శతాయుష్షు' అనక తప్పలేదు.

"తుమ్ము తుమ్ముకే కాక, దగ్గు దగ్గుకి కూడా నువ్వు 'చిరంజీవ, శతాయుష్షు' అంటూంటే ఇరవైయేళ్లకే నేను ఢామ్మని చస్తాను" అన్నాడు గోపీ చిరాగ్గా. కృష్ణవేణమ్మ తెల్లబోయింది.

"ఛీ! అదేమిటి బాబూ, తెల్లవారగట్లా అశుభం మాటలు!"

"మరి లేకపోతే ఏమిటి, పొద్దున్నే? కాసేపు నిద్ర పోనీయకుండా?"

"అన్నానని కోపం తెచ్చుకోకు గోపీ. నిద్రలోనే సగం జీవితం గడిచిపోతుంది. నాలాంటి వాళ్ళకి అదే సుఖం, కానీ నువ్వు జీవితంలో పైకి రావాలనీ, ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాలనీ, సుఖపడాలనీ రోజూ దేవుడికి ఎన్నిసార్లు మొక్కు కుంటానో! నాన్న చూడు. అష్టకష్టాలు పడి, శక్తికి మించిన చాకిరి చెయ్యటం దేనికి? నిన్ను డాక్టరు పరీక్ష చదివించాలని కదూ?"

"సరే, ఇప్పుడేమైంది?"

"ఏమైందో నీకు తెలియదూ? నీ ప్రవర్తన బాగాలేదని ఇవాళ తనని కలుసుకోవలసిందని మీ ప్రిన్సిపాలుగారు నాన్నకి ఉత్తరం రాసారు."

"రాస్తాడు, రాయడూ, ప్రిన్సిపాల్‌కి పనే

ముంది? లెక్చరర్లు ఎలా ఆడిస్తే అలా ఆడతాడు, వొట్టి ఇనెఫిషియంట్–"

"ఆయన్ని ఆడిపోసుకుంటావేంరా? నీ బుద్ధి మంచిదైతే ఒకరు నీ జోలికెందుకొస్తారు? కిందటేడాది లాయర్‌గారమ్మాయిని అల్లరి చేసావని డిస్మిస్ చేసినంతపని చేసారు గదా! ఎంత అప్రతిష్ఠ. మళ్ళీ ఈ సంవత్సరం ఏం చేసావో–"

"నేను యూనియన్ కార్యదర్శిననని ప్రిన్సిపాలుకీ లెక్చరర్లకీ కంటగింపు. ఏదో కారణం వెతికి నన్ను సాధించాలని చూస్తున్నారు. అంతే"

"యూనియన్ కార్యదర్శి అయితే అవిధేయుడివిగా ఉండాలా?"

"అవిధేయత, అవిధేయత! నీకేం తెలుసు విద్యార్థి సమస్యలు, విద్యార్థి మనస్తత్వం. ఏదైనా గట్టిగా అడిగితే అవిధేయత కింద జమ. నేను లీడర్ని. నేనంటే అందరూ బ్రహ్మరథం పడతారు. నీకేం తెలుసు నా సంగతి?"

"పిచ్చివాడా! ఇలాంటి గొప్పలు మన్ని ఉద్ధరించవు. కిందటేడు ట్యూషన్ పెట్టినా పి.యు.సి. లో క్లాసు రాలేదు, ఖర్చుకి చూడకుండా మళ్ళీ ఈ సంవత్సరం చదివిస్తున్నాం. మంచి మార్కులు తెచ్చుకొని మెడిసిన్‌లో సీటు తెచ్చుకో నాన్నా. నీవు డాక్టరువి కావాలన్నదే నా ఒకే ఒక్క కోరిక."

గోపీ మాట్లాడలేదు. అతని దగ్గర్నించి ప్రోత్సాహకరమైన జవాబు రాకపోయేసరికి కృష్ణవేణమ్మ నిరుత్సాహపడ్డది.

"నిన్న ప్రిన్సిపాలుగారి ఉత్తరం చూసినప్పటినించీ నాన్నకి ఆందోళనగా ఉంది. నాన్న మనసు నీకు తెలుసుగా. ఏమంటే ఏం నొచ్చుకుంటావోనని ఎదటబడి నిన్ను ఒక్క మందలింపు మాటన్నా అనరు ఆయన. నువ్వు అది గ్రహించాలి."

గోపీకి విసుగు ఎక్కువైంది.

"అవును. మీరందరూ నా మంచి కోరేవారు, నేను మాత్రం వొట్టి దౌర్భాగ్యుణ్ని, దుర్మార్గుణ్ని. అంతేగా? సరే... అలాగే అనుకోండి. నా ఖర్మ."

అతని వైఖరికి కృష్ణవేణమ్మ గాభరాపడ్డది.

"అదికాదు బాబూ! నీకెలా చెప్పాలో తెలీటంలేదు. మొన్న బార్‌లో నిన్ను చూసానని మన శాస్త్రిగారబ్బాయి చెప్పాడు."

గోపీ విసురుగా తటాలున లేచాడు.

"అవును. మీరిచ్చే పదులూ, ఇరవైలూ ఎలా ఖర్చుపెట్టాలో తెలీక కొట్టుకుంటున్నాను కదూ, బార్‌కి వెడతాను, మరి వెళ్ళనూ..."

## పాత బంగారం

*'పాత బంగారం' శీర్షికన కథాకేళి పాఠకులకు ఈ నెల అందిస్తున్న 'హితశ్రీ' గారి కథ 'కృష్ణవేణి తల్లడిల్లింది' – విద్యార్థి జీవితంలో వేసే తప్పటడుగులవల్ల ఎంతటి దుష్పరిణామాలు సంభవిస్తాయో కన్నులు చెమ్మగిల్లేలా మన కళ్ళముందుంచుతుంది. హితశ్రీ (యం.వి.యన్. ప్రసాదరావు) గారు తెనాలి వి.ఎస్.ఆర్. కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసి, అదే కాలేజీకి ప్రిన్సిపాల్‌గా కూడా వ్యవహరించారు. తన జీవిత కాలంలో రచయితగా ఎంతో ఖ్యాతిపొందారు. వీరి కథాసంపుటి 'హితశ్రీ కథామంజూషిక' గా వెలువడింది. ఎమెస్కో సీరీస్‌లో వీరి రచన' సామాన్యుడి కామన వెలువడింది. వీరు 1999లో కీర్తిశేషులయ్యారు. ఈ కథ 'ఆంధ్రప్రభ' 1970 దీపావళి కథల పోటీలో బహుమతి గెల్చుకొంది.*

గోపీ చప్పున మంచంమీంచి లేచాడు. లోప ల అతనికి బెరుగ్గానే ఉంది. ఈ సి.ఐ.డి. పని చేసేవాళ్ళకి బుద్ధిలేదు. ఆ శాస్త్రిగారబ్బాయి సం గతేమిటో చూడాలి. తను యూనియన్ కార్య దర్శి. ఎవరో ఏదో బలవంతం చేస్తుంటారు. ఎలాకాదంటాడు? 'సోషల్'గా లేకపోతే ఎలా పైకొస్తాడు? అయినా మొన్న కొంచెం పొరపాటే జరిగింది. కాస్త చురుకు ఎక్కువై లెక్చరర్‌తో పేచీ పెట్టుకొన్నాడు. ఆయన ప్రిన్సిపాల్‌కి రిపో ర్టిచ్చాడు. ఇవాళ బెదిరిస్తాడు కాబోలు. సస్పెం డు చేస్తాడేమో?

అతని ధోరణికి కృష్ణవేణమ్మ మరింత దిగు లుపడి పోయింది. నెమ్మదిమీద నచ్చచెప్పాలని తీర్మానించుకుంది.

"సరేలే! త్వరగా ముఖం కడుక్కో బాబూ. కాఫీ ఇస్తాను."

ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

గోపీ ముఖం కడుక్కుంటున్నాడేగానీ అతని మనసు వికలమైంది. ఒక విధంగా తను బాధ్య త విస్మరిస్తున్నాడేమో ననిపించింది. తను బొత్తి గా చదవకపోవటం లేదు. కానీ మనసు నిలవ టం లేదు. చీటికీ మాటికీ విద్యార్థి సమస్యలు తలెత్తుతున్నాయి. తను కావాలని కొన్నిటిని నెత్తి మీద వేసుకున్నాడు. కార్యదర్శి హోదా ఉండ టం వల్ల లెక్చరర్ల దగ్గర ప్రత్యేక అంతస్తుతో మాట్లాడతాడు. వాళ్లకది గిట్టదు. ఏదో మాటా మాటా వస్తుంది. గందరగోళం జరుగుతుంది. విద్యార్థులకి తను ఒక హీరో. అందులో ఏదో నిషా ఉంది. అది వదలటం లేదు.

"ఇదిగో బాబూ కాఫీ"

కాఫీ కప్పుతో ప్రత్యక్షమైన అమ్మని చూసే సరికి అమెపట్ల ఎంతో జాలి కలిగింది. అమ్మకి కష్టం కలిగించకూడదు. కొడి దులిపిన దీపం లా తను చదువులో ప్రవేశించాలి.

చప్పున ముఖం కడగటం ముగించి కాఫీ కప్పు అందుకుని ఓ గుటక వేసాడు గోపీ. కొర బోయింది. తలమీద చెయ్యి పెట్టి అదిమి కృష్ణ వేణమ్మ "పొద్దున్నే ఎవరు తలుచుకుంటున్నారో పిచ్చి తండ్రిని" అంది.

"తలుచుకునే వాళ్లకేం కొదవ?" అన్నాడు గోపీ.

"మా ఆవేదనంతా అందరూ నిన్ను మంచి గా తలుచుకోవాలనే బాబూ. పెద్ద డాక్టరై బీదా బిక్కిని ఆదుకోవాలి. చెల్లెలి పెళ్ళి ఘనంగా జరిపించాలి. ఫలానా రవీంద్రగారబ్బాయని నలుగురూ గొప్పగా చెప్పుకోవాలి. నీ మీద ఎం త ఆశలు పెట్టుకున్నామో నీకు తెలియదు బా బూ, మేమేదో బావుకోవాలని కాదు. మాకు నువ్వు పోసే తులసి నీళ్ళే మందు నీళ్లు. కానీ నీ కర్థం కాదు నాయనా-"

"సరే, సరే, సరే" అన్నాడు గోపీ. కానీ వెం టనే బాధపడ్డాడు. తనలో ఏదో కరుకుతనం కొత్తగా వస్తోంది. తల్లివైపు చూసాడు. అమె కళ్లలో నీళ్ళు తిరిగాయి. "సరేలే అమ్మా" అన్నా డు కొంచెం మృదువుగా.

కృష్ణవేణమ్మ ఇక మాట్లాడకుండా వెళ్లిపో యింది.

కాలేజీ గేటు దాటి లోపలికి పోగానే గోపీకి ఏదో ఆవేశిస్తుంది. ఆ రోజూ అలాగే జరిగింది. జూవాలజీ లెక్చరర్ క్లాస్ జరుగుతోంది. గోపీ పక్క విద్యార్థితో ఏదో మాట్లాడుతున్నాడు. లెక్చ రర్ కళ్లతో రెండు మూడు సార్లు వార్నింగిచ్చా డు. ప్రయోజనం లేకపోయింది.

"మిస్టర్ గోపీ"

"సార్" నిలబడ్డాడు గోపీ.

"మలేరియా ఎందుకు వస్తుంది?"

"దోమకాటు వల్ల"

" ఏ దోమ?"

"మలేరియా దోమ" విద్యార్థులు గొల్లుమన్నారు.

"స్టుపిడ్"

"హూఁ?"

"యూ"

"యూ?" బెంచీలు దబదబా బాదారు విద్యార్థులు.

"షటప్"

"షటప్ వాట్?"

"గెటౌట్" అరిచాడు లెక్చరర్.

పరిస్థితి విషమించింది. అనుకోకుండానే తలతిక్కగా మాట్లాడాడు. ఆడపిల్లలు నవ్వుతున్నారు. విద్యార్థి యూనియన్ కార్యదర్శిని గెటౌట్ అంటాడా? ఒళ్లు మరిచాడు గోపీ.

"యూ గెటౌట్" అన్నాడు తీవ్రంగా గోపీ.

"క్లాస్ కేన్సిల్ చేసాను. ప్రిన్సిపాల్‌కి సంజాయిషీ చెప్పుకో మిస్టర్ గోపీ. ఐ సస్పెండ్ యూ"

"హూ ఆర్ యూ టు సస్పెండ్ మీ?" అన్నాడు గోపీ ధిక్కార స్వరంతో.

లెక్చరర్ క్లాస్ బయటికి వచ్చాడు. "బ్రహ్మాండం" అన్నారు విద్యార్థుల్లో కొందరు. మరికొందరు షేక్‌హేండిచ్చారు. "స్టూడెంట్స్ పరువు నిలబెట్టావు బ్రదర్" అని మెచ్చుకున్నారు మరికొందరు. ఇంకా కొందరు ఆంతరంగికులు "ప్రిన్సిపాల్ దాకాపోతే మక్కెలు విరగతంతాం అని బెదిరిద్దాం పద" అన్నారు. గోపీ యాంత్రికంగా వాళ్లననుసరించాడు.

అందరూ కలిసి ప్రిన్సిపాల్ దగ్గరికి వెడుతున్న జూవాలజీ లెక్చరర్ని అటకాయించారు. ఇంతకుముందు గోపీ ఎన్నడూ దుర్భాషలాడి ఎరగడు. కానీ ఆ రోజు అతన్ని దురాగ్రహం ఆవేశించింది. ఈ లెక్చరర్ మొన్న ప్రిన్సిపాల్‌కి రిపోర్టిచ్చాడు. ఇవాళ సన్నివేశం ప్రిన్సిపాల్ చెవినిపడితే డిస్‌మిస్ చేసేస్తాడు. ఏదో భయం పట్టుకొంది. దానివల్ల మరింత తెగింపు కలిగింది. లెక్చరర్ కాలర్ పట్టుకొన్నాడు. తనని డిస్‌మిస్ చేయిస్తే ఆ రాత్రికే ఆ మనిషి గల్లంతు అవుతాడని శపథం చేశాడు. లెక్చరర్ కళ్ళు ఎర్రబడ్డాయి. మరోసారి "జాగ్రత్త" అని ఆయనని ఒదిలారు.

"పిరికిపంద ఏం చేస్తాడు లేరా, డోంట్ బి ఎఫ్రయిడ్" అన్నారు మిత్ర బృందం. "ఏమన్నా చేస్తే నా తడాఖా చూపించనూ?" అన్నాడు గోపీ.

అయితే మరో పావుగంటలోనే పోలీస్ వాన్ కాలేజీ గేట్‌ముందు ఆగటం, సబిన్‌స్పెక్టర్ ప్రిన్సిపాల్ దగ్గరికి హుటాహుటి వెళ్ళటం గమనించగానే గోపీ పై ప్రాణాలు పైనే పోయాయి. స్నేహితుల అండదండలున్నాయి గదా అని ఓ క్షణం ధైర్యం తెచ్చుకున్నాడు. కానీ తనని దౌర్జన్యానికి ప్రోత్సహించిన ధీరులు అప్పటికే కాలేజీ ఆవరణకి వెనకవైపున గల గోడదూకి పోవటానికి సన్నద్ధులు కావటం చూసేసరికి గోపీ గుండె బేజారెత్తింది. తనని పోలీస్ కస్టడీలోకి తీసుకోటం ఖాయం. కస్టడీలో ఆ యమబాధ గురించి తను విన్నాడు. అదీకాక ఇంక తలెత్తుకుని ఎలా తిరగగలడు? ఇంటికి పారిపోతే పోలీసులు తప్పక అడ్రసు తెలుసుకొని వచ్చి లాకప్‌లోకి తీసుకుంటారు. గోపీకి ముచ్చెమటలు పోసాయి. ఇంక ముందూ వెనకా చూడకుండా




పరుగుతీసాడు. వెనకవైపు ప్రహరీ గోడ దూకాడు. స్టేషన్ రోడ్‌వైపు వెనక్కి చూడకుండా కాలి కొద్దీ దౌడు తీసాడు. గూడ్స్‌యార్డ్ వైపునుంచి పట్టాలు చేరుకుని బయలుదేరటానికి సిద్ధంగా ఉన్న రైలు ఎక్కి ఊపిరి పీల్చుకున్నాడు. గుండెలు దడదడ లాడసాగాయి. అదృష్టవశాత్తు అప్పుడే రైలు కూతవేసి స్టార్టయింది.

గోపీ జేబు చూసుకున్నాడు. ఒక్క రూపాయి మాత్రం ఉంది. ముందు కార్యక్రమం ఏమిటో అర్థంకాలేదు. ఏదో దూరప్రాంతపు స్టేషన్లో దిగి ఏ స్నేహితుడికో ఉత్తరం రాసి కొంత డబ్బు తెప్పించుకోవాలనుకున్నాడు! కానీ అందువల్ల తన ఆచూకి తెలిసిపోవచ్చు. ఇంక కాలేజీ జీవితానికి స్వస్తేనేమో, ఎంత తొందర పడ్డాడు?

"టికెట్" టి.టి.ఇ. చెకింగ్‌కి వస్తున్నాడు. ముచ్చెమటలు పోసాయి గోపీకి. అతని కన్ను కప్పి లావెటరీలో దూరాడు. ఒక గంట ఆ దుర్గంధం భరిస్తూ గడిపాడు. ఆ తర్వాత బయటికి వచ్చాడు. టి.టి.ఇ. లేదు. "బ్రతుకు జీవుడా" అనుకున్నాడు.

సాయంకాలానికి ట్రెయిన్ విజయవాడ చేరింది. అయితే సిగ్నల్ ఇవ్వకపోవటంవల్ల ఔటర్ సిగ్నల్ పోస్టు దగ్గర ఆగింది. విజయవాడలో ఏదో ఉపాధి దొరక్కపోదు. దిగటానికి కూడా మంచి సదుపాయం దొరికింది. గోపీ చప్పున రైలు దిగి నడక సాగించాడు. పట్నం చేరాడు. ఆకలి విపరీతంగా ఉంది. ఉన్న రూపాయి ఖర్చుపెట్టి ఫలహారం చేసాడు. స్టేషన్ చేరుకొని థర్డ్‌క్లాస్ ప్రయాణీకుల వెయిటింగ్ రూమ్‌లో పడుకున్నాడు. కలత నిద్ర పట్టింది.

తెల్లవారింది. సిగరెట్లు లేవు, కాఫీ లేదు, అమ్మ మేలుకొలుపు లేదు. ఇంటి దగ్గర అమ్మా, నాన్న ఎంత గాభరా పడుతున్నారో! కాలేజీలో విద్యార్థులు తనని గురించి ఏమనుకుంటున్నారో? పోలీసువారు ఎటువంటి నిఘా వేసారో! ఎలాగో ఆ లెక్చరర్‌ని కలుసుకుని క్షమించమని

ప్రాధేయపడితే! కానీ రైలు చార్జీ ఏదీ? ముందు ప్రస్తుతం తిండి ఎలా గడుస్తుంది. ఇదంతా కొత్త ప్రదేశం. తనని ఎరిగిన వాళ్లెవరూ లేరు. ఏ హోటల్లోనో సర్వర్‌గా చేరితే! ఇది బేషైన ఆలోచనగా తోచింది. నీళ్లు పుక్కిలించి ఉమ్మివేసి, హోటళ్ళ బోర్డులు వెతుక్కుంటూ ఎక్కేగడపా దిగే గడపాగా తిరిగాడు. ఎవరూ సర్వర్‌గా తీసుకోలేదు. క్లీనర్ అయినా సరే నన్నాడు. అదీ దొరకలేదు. ఆ రోజంతా ఉపవాసమే. కూలీ పనిచేస్తే! నామోషీపడ్డాడు. చీకటి పడ్డది. ఎవరూ తనవైపు దీక్షగా చూడరు లెమ్మని రాజీపడి మార్కెట్ దగ్గర కూలీ కోసం నిలబడ్డాడు, అదీ దొరక్కపోగా అందరూ అతన్ని వింతగా చూడసాగారు. కాళ్ళీడ్చుకుంటూ స్టేషన్ చేరుకుని, కాలే కడుపుతో కలతనిద్ర పోయాడు. మర్నాడు చేసిన ప్రయత్నంకూడా ఫలించలేదు. కడుపులో ఆకలి మండిపోతోంది.

చప్పున ఓ ఉపాయం తోచింది. ఇంగ్లీషలో అడుక్కుంటే? ఆ పథకం వెంటనే అమల్లో పెట్టాడు. "ఇదో కొత్త వేషం" అని అందరూ ఈసడించుకున్నారు. అవును... అడుక్కోటానికి తనకి అర్హత ఏదీ? కాలూ, చెయ్యీ ఉన్నవాడు.

జేబు కొడితే!

బస్సు స్టాండ్‌కి వెళ్ళాడు. లాల్చీ జేబులు బరువుగా ఉన్నవారి వెంట అడుగులు వేయసాగాడు. మాసిన అతని దుస్తులు చూసి అనుమానంగా అతనివైపు ఇద్దరు ముగ్గురు పరకాయించి చూసారు. బిక్కచచ్చిపోయాడు. కాని... రైలు ఛార్జి అయినా దొరికితే...

బస్సు ఎక్కుతున్న ఆసామీ జేబులో చెయ్యి పెట్టిన ఓ ఘరానా సూట్‌వాలాని అప్రయత్నంగా చూసిన గోపీ క్షణం నిర్విణ్ణుడయాడు. రివ్వున పరిగెత్తి అతని చెయ్యి పట్టుకున్నాడు.

"పిక్‌పాకెట్ సార్."

నలుగురూ చేరారు. దొంగని పట్టుకున్నారు. బస్సు ఎక్కబోతున్న ఆసామీ పర్సు జేబులోంచి తీసి చూసుకున్నాడు. అబ్బ, ఎన్ని నోట్లు!

"ఈ కుర్రాడు సమయానికి చూసాడు కనక సరిపోయింది. లేకపోతే ఎంత డబ్బు కొట్టేసేవాడు దగుల్బాజీ. తన్నండి. బాదండి వెధవని" ఆ కుర్రాడిని కింద పడేసి ఇష్టం వచ్చినట్టు కొట్టి "పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్ళండి దొంగగాడిదని" అన్నారు జనం. ఎవరో ఒక ఆసామీ అతన్ని చెయ్యి పుచ్చుకొని లాక్కుపోయాడు. ఇదంతా చూస్తున్న గోపీకి గుండె ఆగినంత పనయింది. ఇంకా నయం. తను దొంగతనం చేసి పట్టుపడలేదు. ఛీ... దొంగతనం కంటే చావు నయం.

పర్స్ దక్కిన ఆసామీ ఒక రూపాయి కూడా గోపీ చేతిలో పెట్టకుండా బస్సెక్కి వెళ్లిపోయాడు. గోపీ విషాదంగా నవ్వుకున్నాడు. తను పట్టుకోకపోతే బావుండేదేమో. పాపం, అతనెటువంటి స్థితిలో దొంగతనం చేయబోయాడో! అబ్బ, ఎలా కొట్టారు!

ఆ రోజూ ఉపోషంతోనే గడిచింది. ఆ రాత్రి అదృష్టవశాత్తూ కిళ్లీకొట్టు యజమాని ఒకడు కుళ్ళిపోయిన రెండు అరటిపళ్లని పారేస్తే చప్పున అందుకుని ఆప్యాయంగా తిన్నాడు. కానీ అది ఆకలిని మరింత ప్రజ్వరిల్లచేసింది. అమ్మ జ్ఞాపకానికొచ్చింది. కళ్లలో నీళ్లు తిరిగాయి.

తెల్లవారి లేవగానే గోపీకి మరో ఉపాయం తట్టింది. కృష్ణ ఒడ్డున పాపపుణ్యాల్లో నమ్మకం గల ధర్మాత్ములుంటారు. వాళ్ళేమైనా చెయ్యి విదిలించవచ్చు. కాళ్ళీడ్చుకుంటూ కృష్ణ ఒడ్డుకి చేరిన గోపీ బ్యారేజికి ఎగువగా వెళ్ళాడు. స్త్రీ పురుషులు చాలామంది స్నానఘట్టాల్లో స్నానం చేస్తున్నారు. దీనంగా చెయ్యి చాపాడు. దుర




దృష్టం. మిగతా అడుక్కునే వాళ్ళకి తృణమో పణమో ముడుతోంది గానీ గోపీకి ఏమీ దక్క లేదు. ఆశగా అందరి ముఖాల్లోకి చూస్తూ నడు స్తున్నాడు. అతని కళ్ళు తటాలున మెరిసాయి.

విస్తట్లో అన్నం.

జనానికి కొంచెం దూరంగా ఎవరో నిలబ డి చేతులు జోడించారు. గోపీ కళ్ళు విస్తరిమీదే ఉన్నాయి. ఎప్పుడెప్పుడు అవకాశం చిక్కుతుం దా అని చూడసాగాడు.

ఆ వ్యక్తి గట్టిగా మంత్రం పఠించసాగాడు.

ఆ తర్వాత ఓ సారి నమస్కారం చేసి దూ రంగా జరిగాడు. అతని కాళ్ళవైపే చూస్తున్న గోపీ చరాలున విస్తరి లంకించుకుని దౌడు తీసాడు.

"పట్టుకోండి, పట్టుకోండి."

కేకలు. జనం పరిగెత్తుతున్న ధ్వని.

ప్రాణానికి తెగించి పరుగు తీస్తున్నాడు గోపీ. కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు తిరగసా గాయి. పట్టుకుంటారేమో. ఈ లోపలే కాస్తన్నా తింటే–

ఆతృతతో ఓ ముద్ద నోట్లో వేసుకున్నాడు.

కొరబోయింది.

"ఎవరు తలుచుకుంటున్నారో చిట్టి తండ్రి ని" అని అమ్మ అన్నట్టయి ఉలిక్కి పడ్డాడు గోపీ. అమ్మా!

"అమ్మా!" అని జాలిగా పిలిచాడు.

"నెమ్మదిగా తినుబాబూ, తిను మరి" అని అమ్మ అన్నట్టయింది. ముద్ద లోపలికి పోలేదు. అలాగే బలవంతాన మింగాడు.

"నా ఒకే ఒక్క కోరిక నువ్వు డాక్టరువి కావాలనే బాబూ..." అని అమ్మ తల నిమిరినట్ట యింది.

గొంతు పట్టుకుంది. దగ్గాడు. "చిరంజీవ" అని అమ్మ అన్నట్టయింది. అంతే! ఇంక మింగు




డు పడలేదు.

కేకలు దగ్గరయాయి. పిచ్చిగా పరిగెత్తాడు. ఎదురుదెబ్బ తగిలి బోర్లాపడ్డాడు. విస్తట్లో అన్నం నేలపాలయింది.

లేవలేక పోతున్నాడు.

జనం బాగా దగ్గరగా చేరిన సవ్వడి.

"వీడి దుంపతెగ. శనిలా దాపురించాడు. బతికి బావుకున్నా లేకపోయినా శ్రాద్ధమైనా దక్కుతుందనుకుంటే ఇలా అయింది. ఖర్మ. ఆ మహాతల్లి దురదృష్టం ఇంతకీ."

ఆ కంఠస్వరం పరిచితమే. పోల్చుకోసాగాడు గోపి. అవును, ఆయన శాస్త్రిగారై ఉండాలి. ఎక్కడ లేని బలం వచ్చింది. లేచి నిలబడ్డాడు.

"శాస్త్రిగారూ!"

ఆ వ్యక్తి అతన్ని పరకాయించి చూసి తెల్లబోయాడు.

"నువ్వా, గోపీ. చివరికి ఇలా బికారిగా తయారయ్యావా? ఆ మహాతల్లి గోడుగోడుమని గుండె పగిలి..."

గోపీ కళ్లు తిరగసాగాయి.

"ఏమిటి, ఏమిటి శాస్త్రిగారూ, అమ్మకి ఏమైంది? ఏమైంది. మా అమ్మ కులాసాయేనా? చెప్పండి." హీనస్వరంతో అన్నాడు.

శాస్త్రిగారి గొంతు గాద్గదికమైంది. చేతులెత్తి కృష్ణవేణమ్మకి నమస్కరించాడు.

"కృష్ణవేణమ్మలో కలిసిపోయినా కొడుకుని కనిపెట్టేఉన్నావా తల్లీ." దుఃఖంతో ఆయన గొంతు పూడిపోయింది.

గోపీ చాపచుట్టగా పడిపోయాడు. విస్తరిని గట్టిగా గుండెకి అదుముకున్నాడు. శాస్త్రిగారు అతన్ని నెమ్మదిగా లేవదీస్తుంటే జనం అర్థం కాని కళ్ళతో వాళ్ళవైపు చూడసాగారు. కృష్ణవేణి తల్లడిల్లి పోసాగింది. ●

# ప్రాచీన భారతీయ ఖగోళశాస్త్ర చతురతను చూపే జంతర్‌మంతర్

భారతదేశంలో ఎన్నెన్నో అద్భుతాలు! ప్రాచీనమైనవి! ప్రతిదానికీ మతం రంగో, మరో రంగో పూసి దాన్ని తక్కువ చేయడం, ప్రాచీన సంస్కృతిని పెద్దగా పట్టించుకోకపోవడం - భారతీయుడికి మొదట్నించీ అలవాటే! గుళ్ళూ, గోపురాలూ అయితే మతం పేరుతో ముడిపెట్టి - 'సెక్యులర్' కాబట్టి వాటి గురించి ప్రస్తావించకుంటే మంచిది. అయితే, అలాంటి వాటి గురించి కాకుండా ఒక విలక్షణమైన ఖగోళశాస్త్ర చతురతను ఇప్పటికీ మన కళ్ళకు కట్టినట్టు చూపించే 'జంతర్‌మంతర్' గురించి ఈ నెల చూద్దాం. ఇది చదివేక మన ప్రాచీన వైజ్ఞానిక, కళావైభవాలన్నీ ఎంత గొప్పవో అర్థమౌతుంది. అపుడు ఖగోళశాస్త్రాభివృద్ధికి భారతీయులెంతో కృషిచేసారనీ, భారతీయుల మేధోసంపత్తి ఆనాడే ఎంతో గొప్పగా ఉండేదనీ నమ్మాల్సిందేనండోయ్! అంటారు!

పశ్చిమ భారతదేశంలో కులమత ప్రసక్తి లేని అద్భుతం ఏదీ అంటే 'జంతర్‌మంతర్' అని చెప్పక తప్పదు. ఇది రాజస్థాన్ రాజధాని అయిన జైపూర్‌లో ఉంది. జైపూర్ గురించి మనం చెప్పుకోవాల్సిందెంతో వుందసలు! (ఆ సంగతులన్నీ త్వరలో తెల్సుకొందాంలెండి!). జైపూర్ వెళ్ళినా, కొత్త ఢిల్లీ వెళ్ళినా 'జంతర్‌మంతర్' చూడాల్సిందే! 'జంతర్‌మంతర్' అంటేనే ఆ పేరు చాలా తమాషాగా అనిపిస్తుంది మనకు.





సంస్కృతంలో జంతర్‌మంతర్ అంటే 'మ్యాజిక్ సాధనం'గా అర్థం చెప్పుకోవచ్చు. దీన్ని 1728 – 1734 సంవత్సరాల మధ్య జైపూర్‌లో మహా రాజా జైసింగ్ – 2 నిర్మించాడు.

శిల్పశాస్త్రం, ఖగోళశాస్త్రం రెండింటినీ కల బోసిన నిర్మాణ పద్ధతులతో జైపూర్ నగరాన్ని రూపొందించి, నిర్మించిన ఘనత జైసింగ్ మహారాజుదే! ఆనాడు ఉన్న కుల ప్రాతిపదిక మీద నగరాన్ని ఏడు దీర్ఘచతురస్రాకార ప్రదేశాలతో ఉండేలా నిర్మించడం జరిగింది. ఈ ఏడు ప్రదేశాల్లో ఏడవది నగరం మధ్యలో వుంది. ఇక్కడే తన రాజభవనాన్ని నిర్మించాడు. దానితోబాటు పవిత్రమైన గర్భగుడి కూడా వుంది. ఇక్కడ జైసింగ్ ఏదో దేవాలయాన్ని నిర్మించి ఉంటే కథే వేరుగా ఉండేది. ఖగోళశాస్త్ర ప్రకారం ఖచ్చితమైన 'గ్రహాల' కదలికల గురించి పూర్తి సమాచారాన్ని అందించే యంత్రాలతో ఉండేలా జంతర్‌మంతర్‌ని నిర్మించడం విశేషతని సంతరించుకొంది. ఇప్పటికీ పనిచేస్తున్న ఖగోళశాస్త్ర ప్రయోగశాలగా అందరూ దీన్ని అభివర్ణిస్తారు. ఢిల్లీలోనూ జంతర్‌మంతర్ ఉంది. కానీ ఇది ప్రస్తుతం ఒక పార్కులా వినియోగంలో వుందే తప్ప అవి పూర్తిగా పనిచేసే పరిస్థితిలో లేవు. జైపూర్‌లోని 'జంతర్‌మంతర్' కేంద్రం మాత్రం ఇప్పటికీ పనిచేస్తోంది. టెలిస్కోప్ కనుగొన్న 120 ఏళ్ళ పైచిలుకు కాలం తర్వాత కూడా ఈ జంతర్‌మంతర్‌లోని ఖగోళశాస్త్ర యంత్రాలు అతి ఖచ్చితమైన ఫలితాలనిస్తున్నాయంటే ఆశ్చర్యం కాదు. అసలు జంతర్‌మంతర్ రూపకల్పనే ఒక ఖగోళశాస్త్ర అద్భుతంగా చెప్పుకొంటారు. పూర్తిస్థాయిలో దాదాపు 5 జంతర్‌మంతర్‌లుండేవనీ, వాటిని ఢిల్లీ, జైపూర్, ఉజ్జయిని, వారణాసి, మధుర నగరాల్లో ఏర్పాటు చేసారనీ చెప్పుకొంటారు. వీటిలో మధుర నక్షత్రశాలగా పేరొందిన జంతర్‌మంతర్ ఇపుడసలు లేనేలేదు. ఉజ్జయిని, వారణాసి కేంద్రాలైన జంతర్‌మంతర్‌లు నిరుపయోగమైపోయాయి. ఢిల్లీలోని జంతర్‌మంతర్ కేవలం పర్యాటక కేంద్ర









ఆకర్షణగా మాత్రమే నిలిచిపోయింది. మన అదృష్టం కొద్దీ జైపూర్‌లోని జంతర్‌మంతర్ మాత్రం ఇప్పటికీ పనిచేసే నక్షత్రశాలగా దర్శనమివ్వడం నిజంగా చెప్పుకోదగ్గ విషయమే. కనీసం దాని పునరుద్ధరణ కోసం మనవాళ్ళు శ్రద్ధ తీసుకొన్నందుకు ఆనందించాలి. ఈ నక్షత్రశాల జైపూర్ కోటలోనే ఉండటం వల్ల కోటను దర్శించి ఈ నక్షత్రశాలనూ చూడొచ్చు. 19వ శతాబ్దంలోనే దీని పునరుద్ధరణ జరిగింది కాబట్టి ఇప్పటికీ పెద్ద సమస్యలేవీ లేకుండా పనిచేస్తోంది జంతర్‌మంతర్ నక్షత్రశాల.

1707లో ఔరంగజేబు మరణించిన తరువాత ఉత్తర భారతదేశం అనేక సమస్యలతో సతమతమయ్యింది. ఆ కాలాన్ని 'చీకటి కాలం' గా చెబుతారు. మొగల్ సామ్రాజ్యం పడిపోవడం, రాజకీయ అనిశ్చితి ఏర్పడటం - అలాంటి సమయంలో మహారాజుగా సవాయిజైసింగ్ - 2 రావడం ఉత్తర భారతదేశాన్నే పూర్తిగా మలుపుతిప్పిందంటే ఆశ్చర్యం కాదు. 11 ఏళ్ళ వయస్సులో తండ్రి మహారాజ బిషన్ సింగ్ (1699 AD) చనిపోవడంతో రాజకీయ రంగ ప్రవేశం చేసాడు జైసింగ్. ఔరంగజేబు సైతం అతని రాజకీయ చతురతకి 'ఔరా!' అనుకొన్నాడని అంటారు. 'సవాయి' బిరుదు కూడా (సవా అంటే 1 1/4 అని అర్థం) ఔరంగజేబు జైసింగ్‌కు ఇచ్చిందే. జైసింగ్‌లోని ప్రతిభాపాటవాలను అతని తండ్రి ముందుగానే గుర్తించాడు. చక్కని విద్యను కొడుక్కి అందించాడు. జైసింగ్ ఎక్కువగా ఖగోళశాస్త్రం మీద మక్కువ చూపాడు. అతని మేధోసంపత్తి అంతా ఖగోళశాస్త్రం చుట్టూనే పెరిగింది. టోలెమీ, యూక్లిడ్, పర్షియన్ ఖగోళశాస్త్రజ్ఞుల గురించి, వారు చేసిన పరిశోధనల గురించీ బాగా చదివాడు. ఎక్కువగా అరబిక్ - పర్షియన్ ఖగోళశాస్త్రాలను అధ్యయనం చేసిన జైసింగ్ భారతీయ ఖగోళశాస్త్రాన్నే నమ్మడం విశేషం. అప్పటికే పాశ్చాత్య ఖగోళశాస్త్రాలను (జైసింగ్ రావడానికి పూర్వమే) భారతదేశంలోకి ప్రవేశించాయి. (520 బిసి నాటికి).









ఇవన్నీ జైసింగ్ ఖగోళశాస్త్ర ప్రావీణ్యతకు పునాదులుగా నిలిచాయి. అందువల్లే ఆయన రాజ్యాన్ని అందుకొని మహారాజు కావడంతో జైపూర్ ని అంత చక్కగా తీర్చిదిద్దాడని అంతా అంటారు. అంబర్ కోటను అధిష్టించినంత మాత్రాన జైసింగ్ రాజకీయ జీవితం ప్రశాంతంగా నడవలేదు. ఔరంగజేబు చనిపోయాక అజాంషా రావడం, అతన్ని బహదూర్‌షా ఓడించడం - ఆతర్వాత జైసింగ్‌ని తొలగించి అతని స్థానంలో విజయ్‌సింగ్‌ని కూచోపెట్టడం - ఇదంతా వేరే కథ.

అసలు ఢిల్లీ జంతర్‌మంతర్ నిర్మాణం అలనాటి చక్రవర్తి మహమ్మద్‌షా కోర్కె మేరకు జైసింగ్ చేపట్టాడని, తద్వారా ఖగోళశాస్త్ర పట్టికలు తయారుచేయించాలన్నదే దాని లక్ష్యమనీ అంటారు. తొలుత ఇత్తడిని వాడి తయారుచేయాలని సంకల్పించినా, తర్వాత చిన్న యంత్రాలు పనికిరావని ఆ ప్రయత్నం విరమించాడట.



మొత్తానికి 1724లో ఢిల్లీలోని జంతర్‌మంతర్ నిర్మాణం పూర్తయింది. ఇక్కడ రామయాత్ర, సామ్రాట్ యాత్ర వంటి యంత్రాలు నిర్మించడం జరిగింది. వీటి నిర్మాణం పూర్తయ్యాక జైసింగ్ ఖగోళశాస్త్ర వివరాలున్న పట్టికలు తయారు చేయనారంభించాడు. వాటిని మహమ్మద్ షానీ పేరున ఒక పుస్తక రూపంలో వెలువరించాడు. దీని తర్వాత జైపూర్ నగర నిర్మాణం చేపట్టడం, దానికి వాస్తు, శిల్పశాస్త్రాలను ఆధారంగా తీసుకోవడం - ఇవన్నీ జైసింగ్‌కి ఖగోళశాస్త్రమ్మీద మక్కువ, పట్టు తెలుపకనే తెలుపుతాయి. వాస్తు శిల్పశాస్త్రం తొలినాటి వేద కాలం నాటిదన్నది నిర్వివాదాంశం. వాస్తు పద విన్యాసం (అంటే స్థల నిర్మాణ రూపకల్పన) ప్రకారం చదరపు స్థలం అనేది నిర్మాణానికి అన్ని విధాలా అనువైంది. ఎందుకంటే తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాల్గు దిక్కులనూ చక్కగా కలిపేది చదరమైన స్థలమే. అందుకే జైపూర్‌ను 7 దీర్ఘచతురస్రాకార భాగాలుగా విభజించడం



జరిగిందంటారు. అలాగే నగర కేంద్ర భాగం అత్యంత కీలకమైన భాగంగా వాస్తు శిల్పశాస్త్రం పేర్కొంది. అందుకనే అక్కడ రాజుగారి కోట, ఖగోళశాస్త్రానుసారంగా నక్షత్రశాల, గుడి ఏర్పాటు చేసాడు.

ఈ జైపూర్ కోట భాగంలో కట్టిన నక్షత్ర శాల ఢిల్లీ జంతర్‌మంతర్‌ను పోలి ఉండి, క్రింది యంత్రాలతో కూడి ఉంది:

సామ్రాట్ యంత్రం, దక్షిణోభిట్టి యంత్రం, దిగంశ యంత్రం, రాశివలయ యంత్రం, జైప్ర కాశ యంత్రం, షష్ఠాంశ యంత్రం, ఉన్నతాశ యంత్రం, నారివలయ ఉత్తరగోళ యంత్రం, రామయంత్రం. ఈ తొమ్మిది యంత్రాల పని తీరు, కొలతలు తీసుకునే విధం – అన్నీ వేరుగా ఉంటాయి. అలాగే ఈ యంత్రాలు ఒక్కోటి ఒక్కో పద్ధతి ఆధారంగా పనిచేస్తాయి. ఉదాహ రణకు క్రింది ఐదు యంత్రాలు ఏ వ్యవస్థ ఆధా రంగా ఏ కొలతలు తీసుకోవడానికి పనికొస్తా యో (Table-1) చూడండి.

మొత్తం 9 యంత్రాల్లో కనీసం 3 యంత్రా లు జైసింగ్ పర్యవేక్షణలో పూర్తిస్థాయిలో రూపుదిద్దుకున్నాయి. అవే సామ్రాట్ యంత్రం, రామ యంత్రం, జైప్రకాశ యంత్రం. ఈ మూడు జైసింగ్ స్వకపోల సృష్టియని అంటారు. జైప్రకాశ యంత్రం అనేది పాలరాతి అర్ధగోళా కారం. ఇది నేల మీద 4 మీటర్ల వ్యాసంతో ఉంటుంది. దీని మీద ఒక లోహపు వలయా కారం ఉంటుంది. దాని లోపలి భాగంలో లోహపు కడ్డీలుంటాయి. దీని మీదపడే సూర్య కాంతి వల్ల సూర్యుని స్థానం ఖచ్చితంగా తెలు స్తుంది. సమయమూ తెలుస్తుంది. రాత్రిళ్ళు దీపం సాయంతో చూడొచ్చు. తద్వారా నక్షత్రా ల స్థానం తెలుసుకోవడం వీలవుతుంది. ఈ దీపం ఒక ట్యూబులా ఉంటుంది. ఒక మనిషి ఆ ట్యూబును పట్టుకొని నిల్చుంటే, మరొకరు కొలతలు తీసుకోవడం – సులభంగా ఉంటుం ది. జైప్రకాశ యంత్రంలో రెండు లోహపు అర్ధ గోళాలు ఉండి ఒకదానికొకటి కాంప్లిమెంటరీ గా ఉంటాయి. ఈ రెండు గోళాలనూ రెండు

| యంత్రం | వ్యవస్థకు ఆధారం | కొలతలు |
|---|---|---|
| 1. రామ యంత్రం | చక్రవాళము, ఉచ్ఛము (Horizon), (Zenith) | ఎత్తు, అజ్‌ముత్ (altitude, azimuth) |
| 2. దిగంశ యంత్రం | చక్రవాళము, ఉచ్ఛము (Horizon), (Zenith) | ఎత్తు, అజ్‌ముత్ (altitude, azimuth) |
| 3. సామ్రాట్ యంత్రం | నిరీక్షరేఖ, భూమి అక్షము (equator), (earth's axis) | Declination, Right ascension |
| 4. రాశివలయ యంత్రం | క్రాంతి వృత్తం, దాని ధ్రువం (ecliptic & it's pole) | అక్షాంశము, రేఖాంశము (Latitude), (Longitude) |
| 5. జైప్రకాశ యంత్రం | చక్రవాళము, ఉచ్ఛము, ధ్రువము, నిరక్షరేఖ | (1 & 3) |

Table-1





గంటల తేడాతో మార్చిమార్చి వాడి, మొత్తం 24 గంటల్లోనూ వాడుకోవచ్చు. మరీ లోతుగా చెప్పుకొంటూపోతే ఈ వ్యాసం మొత్తం ఒక సైన్సు పాఠంలా తయారౌతుందేమోనన్న ఉద్దేశ్యంతో ఎక్కువగా చెప్పడం లేదు. పన్నెండు రాశులకూ ఒక్కో రాశికో యంత్రం ఏర్పాటు చేయడం జరిగింది. వీటినే రాశివలయ యంత్రాలంటారు. తులారాశి, వృశ్చికరాశి, కన్య రాశి ఇలా 12 రాశులకూ ప్రత్యేకంగా ఒక్కో యంత్రం ఉంది. ఆయా నక్షత్రాల స్థానాలను లెక్కించడానికి వీలునిస్తాయి. ఇలా చెప్పుకొంటూపోతే ఎన్ని పేజీలైనా చాలవు. ఈ యంత్రాల నిర్మాణంలో జైసింగ్ కొన్ని ప్రత్యేకంగా తయారుచేసిన లోహ మిశ్రమాలు (అల్లాయ్) వాడటం, ఆ మిశ్రమాల్లో 7 ప్రత్యేకమైన లోహాలను కలపడం. ఇవన్నీ జైసింగ్ ఘనతగానే చెప్పుకొంటారు.

ఈ యంత్రాలన్నీ ఖగోళశాస్త్ర యంత్రాలుగా కాకుండా, కళాత్మకమైన దృష్టితో కూడా చూడవచ్చు. చూడటానికెంతో అందంగా ఉంది. చూపరులకు ఆనందాన్ని ఇస్తున్నాయి. ఇది ఈ వ్యాస రచయిత స్వయంగా చూసిన అనుభవ పాఠం కూడా. ఢిల్లీలోనూ, జైపూర్‌లోనూ రెండు చోట్లా అది అనుభవమైంది. విదేశీ విద్యార్థులు రావడం, కొంతకాలం జైపూర్‌లోనే ఉండి. ఖగోళశాస్త్ర సంగతులను నేర్చుకోవడం ఇప్పటికీ చూడొచ్చు. ఈ యంత్రాల్లో ఎక్కువగా రాతిని వాడటం కూడా గమనార్హం. దేశ విదేశాల్లో వేరే ఎక్కడా కనిపించని (ఈజిప్టు, దక్షిణ అమెరికాల్లాంటి చోట్లని మినహాయిస్తే) రాతి కట్టడాలైన యంత్రాలు కేవలం ఒక్క జైపూర్‌లోనే వున్నాయి. ఈ సారి జైపూర్ వెళ్ళినపుడు జంతర్‌మంతర్‌ను సునిశితంగా పరిశీలించండి. అక్కడ గైడ్ల సాయంతో విషయజ్ఞానాన్ని సంపాదించండి. జంతర్‌మంతర్ మన ప్రాచీన ఖగోళ శాస్త్ర పతిమకు ప్రతీక అని నమ్మాల్సిందే. ●







# పది వసంతాల ప్రస్థానంలో కథానిలయం




నాగావళి తీరం...

శ్రీకాకుళ పట్టణం...

మహామనీషి కలల సాకారం – ఒక ట్రస్ట్ అవిశ్రాంత కార్యరూపం – ఎందరో అభిమానుల, దాతల సహకార ఫలితం – 'కథానిలయం.'

ఫిబ్రవరి 10, 11 తేదీలలో తన పదవ వార్షికోత్సవం జరుపుకుంది.

పది వసంతాల ప్రస్థానంలో ఎత్తుపల్లాలను సమీక్షించుకుంది.

10వ తేదీన అతిథులతో ఇష్టాగోష్ఠి కార్యక్రమం. అందులో ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన వారూ స్థానికులూ పాల్గొన్నారు.

'జ్వాలాముఖి' గారు 'డయోస్పోరా' సాహిత్య విషయంగా చేసి – చర్చనీయాంశంగా ప్రవేశపెట్టారు. ఆ చర్చలో – వివిన మూర్తి, డా॥ మానేపల్లి, డా॥ బి.వి.ఎ. రామారావు నాయుడు, పత్తి నాగేశ్వరరావు, అల్లం రాజయ్య, ఎ.వి. రెడ్డిశాస్త్రి మొదలైనవారు పాల్గొన్నారు.

ప్రపంచీకరణ నేపథ్యంగా సాగిన ఈ చర్చ – సాహితీ అభిమానులకు, వర్ధమాన రచయితలకు చక్కని అవగాహనా వాహిక అయింది.

11వ తేదీన – సరిగ్గా ఉదయం 10 గంటలకు వార్షికోత్సవ సభ ట్రస్ట్ సభ్యులు దాసరి రామచంద్రరావు ఆహ్వానంతో ప్రారంభమైంది. కాళీపట్నం రామారావు తన అధ్యక్ష ప్రసంగంలో "కథానిలయాన్ని ఎవరు సందర్శించినా సంతృప్తి ప్రకటిస్తూ తోచిన సలహా సహకారాలను అందిస్తూ వచ్చారు. వారి అభిమానాలే – మా నిర్వహణకు తగిన బలం. తగిన ధన,



'కథానిలయం' 10వ వార్షికోత్సవ వేడుకలకు ఆహ్వానం పలుకుతున్న శ్రీ దాసరి రామచంద్రరావు. వేదికపై శ్రీ బి.వి. రామారావు నాయుడు, శ్రీ కాళీపట్నం రామారావు, శ్రీ జ్వాలాముఖి, డాక్టర్ సి. మృణాళిని.



'కారా' మాస్టారి నుంచి రాచకొండ రచనా పురస్కారాన్ని అందుకుంటున్న శ్రీ తుమ్మేటి రఘోత్తమరెడ్డి. పురస్కార గ్రహీతను పరిచయం చేసిన శ్రీ అల్లం రాజయ్య (కుడిపక్క)

మానవ సహాయాలు చేకూర్చుకుని ఆశించిన లక్ష్యాల దిశగా వెళ్తామ"ని తెలిపారు. కథానిలయం కార్యదర్శి డా॥ బి.వి.ఎ. రామారావు నాయుడు కథానిలయం నివేదికను చదివి వినిపించారు. "కథానిలయం లక్ష్యాల్లో కంఠస్వరాలు రికార్డు చేయడం, రాతప్రతులు సేకరించి ఉంచడం, ఫోటోలు సేకరించిపెట్టడం లాంటివి చేర్చాం. కథా నిలయం పట్ల అందరికీ గౌరవముంది. కథా నిలయానికి సహకరించడం ఒక బాధ్యతగా చాలామంది గుర్తిస్తున్నారు" అని తెలిపారు.

ప్రత్యేక సాహితీ ప్రసంగం చేసిన డా॥ సి. మృణాళిని – నాలుగు ప్రపంచ కథలను (రష్యా, అమెరికా, ఫ్రెంచ్, లాటిన్ అమెరికా) తీసుకుని అందులో 'మృత్యువు'ను ముగింపుగా చూపించిన ఆ కథకులు వస్తువును, శిల్పాన్ని ఎలా డీల్ చేసారో విశ్లేషించి ప్రసంగించేరు. ముఖ్య అతిథి జ్వాలాముఖి మాట్లాడుతూ – 'మృత్యువు'ను ముగింపులో కథకుడెలా చూపుతాడు అన్నదాంట్లోనే అతడి దృక్పథం ఉంటుంది. మృత్యువుతో ముగింపు 'న'కారాత్మకంగా ఉండకూడదన్నారు.

తమిరిశ జానకి, కె. వరలక్ష్మి, జాన్సన్ చోరగుడి, గంటేడ గౌరునాయుడు, కర్ర ఎల్లారెడ్డి కథానిలయం పట్ల తమ ఆత్మీయస్పందన తెలియజేసారు. తర్వాత 'రాచకొండ' రచనా పురస్కార సభ జరిగింది. 6000 రూపాయల నగదు పురస్కారాన్ని కారా మాస్టారు తుమ్మేటి రఘోత్తమరెడ్డికి అందజేసారు. తుమ్మేటి సాహితీ జీవితంపై అల్లంరాజయ్య ప్రసంగించేరు. ఈ సభకు 'రచన' శాయి నిర్వాహకులుగా ఉన్నారు. ఈ సభలో ఇంకా – భమిడిపాటి జగన్నాథరావు, అట్టాడ అప్పల్నాయుడు, చలసాని ప్రసాద్, యగళ్ల రామకృష్ణ మొదలైనవారు పాల్గొన్నారు. కాళీపట్నం సుబ్బారావు వందన సమర్పణ చేసారు.

**దాసరి రామచంద్రరావు**

## ఆకాశమల్లె (కవితలు)

రచన: **హిమజ**



వెల: **రు. 50/-**
ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్నిబ్రాంచీలు

ఈ కవితా గుచ్ఛంలో మొత్తం 52 కవితలున్నాయి.

వీటిలో అధిక భాగం ప్రముఖ పత్రికల్లో ఇంతకుమునుపే ప్రచురితమై పాఠకుల ప్రశంసలు పొందినవే.

'ఆకాశమల్లె' కవితలో కమ్మని వేణుగానం, కస్తూరి పరిమళం అమృతపురుచీ – పాఠకుల్ని అలరిస్తాయి. దాదాపు అన్నికవితల్లో చక్కని భావధార ఉంది. భాషలో ఆడంబరం ఏ కోశానా కనిపించదు. తేటతేట మాటల్లో సూటిగా, నిజాయితీగా తన అంతరంగాన్ని ఆవిష్కరించారు కవయిత్రి.

ప్రతికవితలోగల పదచిత్రాలు కవయిత్రి ప్రతిభకు అద్దం పడతాయి. మానవజీవితంలోని అతి సామాన్య అంశాలను కూడా కవయిత్రి–కవితావస్తువులుగా స్వీకరించి, అందంగా మలచిన తీరు ప్రశంసనీయం (ఉదా॥ హిస్టరెక్టమీ).

కొన్ని కవితల్లో కొట్టొచ్చినట్లు సామాజిక స్పృహ – సమకాలీన సంఘటనల చిత్రణ కనిపిస్తాయి. చాలామంది కవులు ఈ ప్రయత్నం చేస్తుంటారు. కానీ కొద్దిమందే సఫలీకృతులౌతారు. హిమజ గారు సఫలీకృతులేకాదు, ధన్యులుకూడా...

ఈ కవయిత్రి నుండి మరిన్ని మంచి కవితలు మనం చదవగలమనే భరోసా ఈ పుస్తకం ఇస్తోంది. ఈ కవితా సంపుటి పూర్తిగా చదవటం – మనలో చక్కని అనుభూతుల్ని కలిగిస్తుంది. తప్పక చదవాల్సిన పుస్తకం.

---

## అంతర్నేత్రం కథలు

రచన: **వడలి రాధాకృష్ణ**



వెల: **రు. 50/-**
ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు

ఇందులో 15 కథలు – జీవితాన్ని భిన్నకోణాలలో, రంగులలో దర్శింపజేస్తాయి. ప్రతి కథకూ అలంకరణగా సముచితమైన చిత్రాలు కూర్చటం ఒక ప్రత్యేక ఆకర్షణ.

'అంతర్నేత్రం' కథలో కఠిన వాస్తవాల పునాదుల మీద సజీవ చిత్రణ కనిపిస్తుంది. ఒక ఆత్మశోధన, ఒక అంతర్మధనం, ఒక వివేచనతో, మానవత్వపు గుబాళింపుతో కథ ముగుస్తుంది.

ప్రతి కథలోనూ శిల్పనైపుణ్యం కనిపిస్తుంది. చక్కని కథనంతో, ఇతివృత్తాల ఎంపికలో కూడా ఎంతో మెళకువ చూపటం పాఠకుల్ని చదివింపజేస్తుంది.

ముఖపత్ర రచన కంటికింపుగా ఉంది. ముందుమాటలు రాసిన ప్రముఖ రచయితలు అమూల్యాభిప్రాయాలతో ఆశీర్వదించారు. ఇక పాఠకుల ఆశీస్సులే ఆవశ్యకం. మంచి కథల్ని ప్రేమించేవారు ఈ పుస్తకాన్ని ఎంతో ఇష్టపడతారు.

**Panasonic**
ideas for life

# TRIPLE BENEFIT OFFER

**Panasonic**
**ఆటోమేటిక్ కుక్కర్ కొనండి**

**ముచ్చటగా**
**3**
**ఉచిత**
**బహుమతులు**
**పొందండి**




SR - WA 18H / 22H




| Extra Cooking Pan | 2 Dish Seperator Pan | Idly Stand |
|---|---|---|
| Rs. 285/- | Rs. 150/- | Rs. 215/- |

**AVAILABLE AT ALL LEADING STORES**

Regd. No. APTEL / 2006 / 1806

KRSA101PM120

# Power Promo

**Panasonic**
ideas for life

# POWER PLAY

T [tau]

**Limited Edition**
**EMI - Rs. 849/-**

**TC-21FJW**
- 400W PMPO sound
- Surround Sound
- Virtual Hyper Bass
- Graphic Equalizer
- Rapid Tune
- 16:9 Aspect Ratio



**Presenting the season's hot favourite,**
**The Power Play Range.**
**Available only during the World Cup for your viewing pleasure. Hurry!**



**Limited Edition**
**EMI - Rs. 1499/-**

**TC-29FJW**
- 400W PMPO sound
- Surround Sound
- Virtual Hyper Bass
- Graphic Equalizer
- 16:9 Aspect Ratio
- DVD YUV connection

## AMAZING GIFTS TO BE WON!

**GRAND PRIZE! 10 PLASMA TVs TO BE WON**
Each worth Rs. 94,990/-

DSC
Worth Rs. 20,990/-



Home Theatres
Worth Rs. 11,990/-



Automatic Cookers
Worth Rs. 1,795/-





**Assured Gift - Sports Watch**

BC



DVC
Worth Rs. 23,990/-



Mini Compo
Worth Rs. 14,990/-



Super Mixer-Grinders
Worth Rs. 3,145/-



Hair Dryers
Worth Rs. 725/-

**HATRICK OFFER** — **SCRATCH & WIN** | **0% Finance** | **Low EMI of Rs. 649/- Under exchange**

Branch Office:
…sonic Sales & Service India Pvt. Ltd.
…tpally, Hyderabad. Ph: 23073690

…thorised Distributor Costal A.P.:
S.R.R. Enterprises, Vijayawada

For Trade Enquiry Contact: **Panasonic** - 94408 02613


మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M120 |
| పుస్తకం పేరు | కథాకేళి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజ పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |